## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్చంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్ధికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఈశ్వరప్రార్థనలు.

(ఆయాతరుణములయందు జేయఁదగినవి.)

# పాపక్షయపాపనివృత్తులు.

# సద్గుణాభ్యాసము.

ఇది

దిగుమర్తి వెంకటరామయ్యచే
రచియింపఁబడినది.



కాకినాడ
శ్రీ సావిత్రీ ముద్రాక్షరశాల.
**1908.**



వెల రు 0-4-0 లు.

# విషయసూచిక

## ప్రార్థనలు.

పుట

## పాపక్షయపాపనివృత్తులు.







# అవతారిక.

మానవులు, పరమపదమును బొందుటకుఁ గర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము, అను మూడుమార్గములు ఏర్పడియున్నవి.

ఈకాలములో వేదవిహితకర్మానుష్ఠానము దుష్కరము. జ్ఞానయోగసిద్ధి సర్వసంగపరిత్యాగము చేసిన సన్యాసులకున్నైతము అతిదుర్లభము. భక్తియోగము పైరెండింటికంటెను సులభతరము. కావున భక్తియోగముచే ఈశ్వరుని ఉపాసించుట సర్వజనులకుఁ గర్తవ్యమైయున్నది.

భక్తి అనఁగా దృఢవిశ్వాసమువలనఁగలిగిన ప్రేమ అని చెప్పవచ్చును. అది మనోధర్మమైయున్నది గాన, ప్రేమతోఁ గూడిన మనమనస్సును ఈశ్వరునియందు లగ్నముచేయుటయే భక్తియోగమునకు ముఖ్యలక్షణమైయున్నది.

అయినను బాహ్యేంద్రియములలో వేనిసహాయమయిన లేకుండ మనస్సును ఈశ్వరునియందుఁ జేర్చుట సులభసాధ్యము కానందునఁ గరచరణాదులచేఁ జేయఁదగిన అర్చనాదికమును వాక్సహాయముచేఁ జేయదగిన స్తోత్రాదికమును భక్తియోగమునకు సాధనములుగా మనవారు అంగీకరించియున్నారు.

అర్చనకు ధూపదీపనైవేద్యాది సాధనసంపత్తి చాల గావలసియున్నది. ఆసాధనములు సర్వకాలములయందును సర్వావస్థలయందును సర్వజనులకు సర్వత్రసులభముగా సమకూడునవికావు.

స్తోత్రాదికమో, సర్వకాల సర్వావస్థలయందును, వాగింద్రియముగల సర్వజనులకును సమకూడునది.

కాఁబట్టి కేవల వాక్సహాయమువల్లఁ జేయఁదగిన స్తోత్రాదికముద్వారమునఁ బ్రేమతోఁగూడిన మనస్సును ఈశ్వరునియందు లగ్నముచేయుట, ఈశ్వరకటాక్షమును గోరిన మానవులకందఱికిని విధాయకమైయున్నది.

ఇట్లువాక్సహాయముతోఁ జేయఁబడు ఈశ్వరోపాసన, సామాన్యముగా 5 అంగములుగలది.

ఒకటి, సృష్టివైచిత్ర్యములను యోజించి, ఈశ్వరుని సర్వశక్తి, సర్వజ్ఞత్వము, సర్వవ్యాపకత్వము, అనన్యసాధారణ మహిమావిశేషము, అపారకరుణారసత్వము, మొదలగు అనంతకల్యాణగుణములను దెలిసికొని, అందువలన స్వా

భావికముగా గలిగెడియాశ్చర్యమును వ్యక్తపఱచుట, యను స్తోత్రము.

రెండు, సృష్టివిశేషములును, సర్వజ్ఞత్వాది అద్భుతశక్తులును, ప్రాణులసౌఖ్యముకొఱకును, మేలుకొఱకును, వినియోగపఱపఁబడినందుకును, ఈశ్వరకటాక్షముచే మనకుఁగలిగిన మేలునకును, ఈశ్వరునియందు మనకుఁగల కృతజ్ఞతాసూచకమైన, వందనాదికము.

మూఁడు, ఈశ్వరమహిమలను మనస్సులోమననముచేయుచు ఈశ్వరునియందు మనస్సును నిలిపియుంచుట, అనఁబడు ధ్యానము.

నాలుగు, మనముచేసిన దుష్కార్యములు, తలంచిన దురుద్దేశములు, వ్యర్థపరచినకాలము, మొదలగు పాపములను, తలఁచుకొని పరితపించి ఈశ్వరుని క్షమనుగోరుట, అనఁబడు పశ్చాత్తాపము.

అయిదు, శమదమాదులు, భూతదయ, సత్యవాక్యసంపన్నత, సమబుద్ధి, ఇత్యాది సుగుణ సంపత్తినిగుఱించియు, ఈశ్వర సంకల్పమునకు వ్యతిరేకముకాని యితరవాంఛలనుగుఱించియు, ఈశ్వరుని వేఁడుకొనుట, అనఁబడు ప్రార్థన.

కాఁబట్టి, ఈశ్వరుని కరుణకుఁ బాత్రులముకాఁగోరి మనము అభ్యసించు భక్తియోగమునందు, పైఁజెప్పబడిన అయిదు సాధనములును ఉండవలయును.

మన మతగ్రంథములలో అనేకములైన స్తోత్రములు, ప్రార్థనలు, ఉన్నవిగాని, అవిఅన్నియు వ్యాఖ్యానములు చేయఁబడినను నేటివఱకును నిర్వివాదముగా అర్థము తెలియని శ్రుతి స్మృతులలోను, దేశభాష కాని సంస్కృతభాషలోను, ఛందోబద్ధమయి కఠినపదములతోఁగూడిన పద్యములలోను, ఉన్నవి. అందువలన వానిలోఁ జాలభాగము అర్థము కాకయు, అర్థమైనను అవిమనస్సునకు బాగుగఁబట్టకయు, ఆప్రార్థనాదులను గుడ్డిపాటగాఁ బాడుటయే సాధారణముగా జరుగుచున్నదిగాని, వానిద్వారమున మనతలంపులను, అభిప్రాయములను, వాంఛలను, దెలివితో ఈశ్వరసన్నిధానమందు విన్నవించుటకు వీలులేకయున్నది. మరియు, సామాన్యముగా మనవారు చేయు స్తోత్రాదులలోఁ బైఅయిదు అంశములుగల స్తోత్రములు అరుదుగానున్నట్టు కనఁబడుచున్నయవి.

ఇంతియెగాక, ఆస్తోత్రాదులు సామాన్యముగా శివవిష్ణ్వాది భేదముగల వేరువేరుదేవతల నుద్దేశించి చేయఁబడియుండుటచేత, అన్నిమతములవారును సర్వసామాన్యముగా ఉపయోగపర్చుటకుఁ దగియుండలేదు. ఆస్తోత్రములలోఁ జాలభాగము సగుణసరూపస్తోత్రములు అగుటచేతఁ గిరీట కేయూర కంకణములుగలవాఁడు, అని, నల్లనివాఁడు, తెల్లనివాఁడు, సమవిభక్తాంగుఁడు, ముంగురులుగలవాఁడు, కుఱుచ మెండ్రుకలు గలవాఁడు, అని, యిట్టిమానుష సామాన్యమైన విశేషణములతోఁ గూడియున్నవి. అనన్యసామాన్యములయిన అనంత

కల్యాణగుణములుగల సర్వేశ్వరుని పైనిజెప్పినరీతిని స్తోత్రము చేయుటవలన మనభక్తి ప్రజ్వలింపనేరదు. ఇప్పటి నవనాగరికులకు అట్టిస్తోత్రములు విశేషసమ్మతములును గానేరవు.

ఈశ్వరుఁడు ఇట్టిరూపముగలవాఁడని చెప్పుటకు శక్యము కానివాఁడగుటచే, సరూపధ్యానమునకంటె గజేంద్రునివలె ఈశ్వరసన్నిధానమునుమాత్రము కల్పించుకొనిచేయు అరూపధ్యానమే యిప్పటికాలములో సర్వజనసమ్మతమై ఉండును. సగుణోపాసనలో నేదేవతనో, రూపమునో, ఉపాసనచేయువారు ఆదేవతనో, ఆరూపమునో తమ మనస్సులో నిలుపుకొని, ఆరూపోపాసనను ఆదేవతకో రూపమునకో అన్వయించుకొనవచ్చును.

ఈఅన్ని హేతువులనుబట్టి, ఇందువ్రాయఁబడిన ప్రార్థనాదులు, మనపెద్దలుచేసిన స్తోత్రములలోనుండియు, బ్రహ్మమతస్థులలోను క్రీస్తుమతస్థులలోను బ్రసిద్ధులయిన భక్తులువ్రాసినస్తోత్రాదులలోనుండియు, ఎత్తి సమకూర్చివ్రాయఁబడినవి.

ఈశ్వరభక్తిని గలుగఁజేయుటకును, వృద్ధిచేయుటకును, మనసద్గుణములను సత్ప్రవర్తనను వృద్ధిచేయుటకును, ఈ స్తోత్రములు కొంచెమైన సహకారులుగా నున్నట్లు ఆమోదింపఁబడినయెడల ఆయాకాలములయందును ఆయాఅవస్థలయందును ఆయానిమిత్తములయందును, జేయఁదగిన మఱికొన్ని ప్రార్థనలను వ్రాసి ప్రచురించుటకుఁ దలంపుగలదు.

ఉదయకాలపుఁబ్రార్థన నిద్రనుండి లేచినతోడను, సాయంకాలపుఁబ్రార్థన నిద్రించుటకుముందును, మిగిలినప్రార్థనలు భోజనమునకుముందును, జేయుటయుక్తము.

మఱియు ఈప్రార్థనలను జేయునపుడు అవకాశమైనంతవఱకు విజనస్థలమందు స్థిరముగాఁగూర్చుండి కన్నులుమూసి చేతులుజోడించి ఇతరసంగతులను జెవియందుఁబడనీయక సమాహితచిత్తముతో నుండవలెను. ఈశ్వరుఁడు తనయెదుటఁదెర చాటుగానుండి తానుజేయు స్తోత్రాదులను వినుచున్నట్టుభావించి తనకష్టసుఖములను దనప్రభువుతోఁగాని తండ్రితోఁగాని అతనిమనస్సును గఱఁగించి జాలిపుట్టించి అతనివల్లఁ దనఅభీష్టమును నెఱవేర్చుకొను తలంపుతోఁ జెప్పుకొనురీతిని ఈప్రార్థనలను జేయవలయును.

ఇట్లుప్రతిదినమును జేసినయెడల ఈశ్వరకటాక్షముచేఁ జిత్తశుద్ధియును, అందువలన సత్ప్రవర్తనయును, గలుగుటయే కాక నానాఁటికిఁ గొంతవఱకు నిశ్చలచిత్తముకుదిరి యీశ్వరసాన్నిధ్యమువలనఁగలుగు పరమానందమును జవిచూడవచ్చునని నమ్ముచున్నాఁడను.

ఓంతత్సత్.

---

## రెండవకూర్పునకు అవతారిక.

మొదటికూర్పు మొదటియుద్దేశముప్రకారము ముఖ్యముగా నాబంధుజనులకును స్నేహితులకును బంచిపెట్టఁబడినది. ఇటీవలఁబలువురు దీనిప్రతులను బంపుఁడని కోరుచువచ్చినందున ఈరెండవకూర్పు ముద్రింపఁబడినది.

ప్రతిదినమును ఒకేప్రార్థనచేసినయెడల విసుగుదలకలుగవచ్చును. ఈశ్వరకటాక్షమునుబొంది మనమునివర్తించుకొనవలసిన లోపములును బొందవలసిన సద్గుణములును అనేకములుగలవు. వానినన్నిటిని ఒకేప్రార్థనలో నిమిడ్చినయెడల ఆ ప్రార్థన దీర్ఘముగానుండి చీదరపుట్టింపవచ్చును. వేరువేరుప్రార్థనలలో నిమిడ్చినయెడల, అట్టిదోషముండదు. నిర్మలచిత్తముతో ఈశ్వరసాన్నిధ్యమును గలుగఁజేసికొనుటకు ఉదయకాలము మిక్కిలి సూటిగనుండును. కాన భక్తిపారవశ్యము కలిగినయెడల మరికొంతసేపు ఈశ్వరసన్నిధానము ననుభవింపబుద్ధిపుట్టవచ్చును. ఒకటేప్రార్థనను బఠింపవలసివచ్చినయెడల, అట్టిసమయమందు మనస్సునకుఁ దనివితీఱకయుండును. ఇట్టికారణములవలన మరికొన్ని ఉదయకాలపుఁ బ్రార్థనలు ఇందులోఁ జేర్పఁబడినవి.

నిశ్శబ్దముగానుండు నిశీథినియందు ఇంద్రియవ్యాపారములు సంకుచితములై మనస్సు స్వస్థతకలిగియుండును. అట్టి

తఱిని ఈశ్వరునియందు బుద్ధిని లగ్నముచేయుట కొంతసులభముగ నుండవచ్చును. కాఁబట్టి అట్టిసమయమునకు నొక తగిన ప్రార్థన ఇందులోఁ జేర్పఁబడినది.

ఆయాతరుణములయందుఁ జేయఁదగినప్రార్థనలను వ్రాయుటకు అభిప్రాయముకలదని మొదటికూర్పు అవతారికలో సూచింపఁబడినది. అట్టితరుణములలో సర్వేశ్వరుని కటాక్షముచే మనకులభించిన ప్రాణాధారకములగు భక్ష్యభోజ్యాదులను మనము అనుభవింపకముందును, వానినిభుజించి తృప్తిఁబొందిన వెనుకను, మనకృతజ్ఞతాసూచకములైన వందనములను సర్వేశ్వరునకు అర్పించుటకు ముఖ్యకాలములైయున్నవి; కావున ఆతరుణములయందుఁ జేయదగిన ప్రార్థనలను రెంటిని ఇందులో వ్రాసితిని. అట్టిసమయములందీశ్వరునిఁ బ్రార్థించుట అత్యావశ్యకమను సంగతి ద్విజులు తప్పక చేయవలయునని విధింపఁబడిన పూర్వోత్తరాపోశనములవల్ల స్పష్టపడుచున్నది. ఇట్టి విధాయకమైన యీశ్వరచింతనను ఏజాతివారైనను ఏమతము వారైనను బ్రతిపురుషుఁడును బ్రతిస్త్రీయును జేయఁదగియున్నది. కాన నీప్రార్థనలు ఆదరణీయములైయుండునని ఊహింపఁబడినవి. సంపదలోను రుగ్ణతలోను జేయఁదగిన ప్రార్థనలు, అర్చనకుపూర్వము చేయఁదగిన ప్రార్థన, యీశ్వరపారతంత్ర్యమును దెలుపుడుచేయు ప్రార్థన, కూడ ఇందులోఁ జేర్పఁబడినవి.

---

## మూఁడవకూర్పునకు అవతారిక.



రెండవకూర్పుయొక్క 1000 ప్రతులలో నించుమించుగ సగము బంధుమిత్రులకు సమర్పింపఁబడినవి. మిగిలిన ప్రతులు కోరినవారికి ఉచితముగఁబంపఁబడినవి. ఈపుస్తకమును జదివినవారు దానిలోనున్న లోపములనుగణింపక దానిని గుణించి నాకు ఉత్సాహముకలుగునట్లు ప్రశంసించిరి. ఇటీవల ఈపుస్తకము «మనోరమ» అనుమాసపత్రికలో ప్రశంసింపఁబడినందునఁ బలువురు సదరు ప్రతులనుగోరి జాబులువ్రాయుచున్నారు. ఈపుస్తకమును బడసినవారిలోఁ గొందఱు తమబంధుమిత్రుల ఉపయోగముకొఱకు మరికొన్ని ప్రతులను బడయఁగోరియు ఉచితముగఁబంపించుమని కోరుటకు సంశయించి తగుపాటివిలువ యేర్పఱిచి ప్రతులను విక్రయించిన యుక్తముగనుండునని సూచించిరి.

ఈకారణములచే మరియొకకూర్పును ముద్రింపించి స్వల్పక్రయము నేర్పఱిచి ప్రతులను విక్రయింప నిశ్చయింపఁబడినది.

ఈకూర్పును ముద్రింపించుటలో మరికొన్ని ప్రార్థనలను జేర్చుటకు ఉద్దేశము ఉండెనుగాని ఈమధ్యశరీరస్వస్థత లేకపోవుటచేతను మరికొన్ని చిక్కులుసంభవించుటచేతను అట్లుజరి

గించలేకపోయినందుకు విచారపడుచున్నాను. సాయంకాల పుఁబ్రార్థనమాత్రము మరియొకటిచేర్పఁబడినది.

వెనుకటికూర్పులోఁగన్పడిన లేఖక ప్రమాదాదిదోషము లు ఈకూర్పులోలేకుండ సవరించిన మహారాజశ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు రావుబహద్దరుగారికి వందనములుచే యుచున్నాను.

| | |
|---|---|
| బ్రహ్మపురము,<br>1-10-1907. | ఇట్లు విధేయుఁడు<br>దిగుమర్తి వేంకటరామయ్య. |



# ఈశ్వరప్రార్థనలు.

## ఉదయకాలపుఁ బ్రార్థన.

ఓం

పరమాత్మనే నమః.

ఓ దేవా! నేను నిరాదరుఁడనై నిద్రపోవునపుడు దయాళుఁడవైన నీవుగదా కరుణతోఁ గాచి రక్షించితివి.

కన్నులకుఁ గానవచ్చు సకలమును మహిమగల నీదివ్యచిత్తసంకల్పమును అపరిమితవాత్సల్యమును దెలుపుచేయుచున్నది.

ఈయుదయకాలమునఁ గృతజ్ఞతతో నేను జేయుస్తోత్రములను అంగీకరింపుము.

ఈదినము, నామనస్సును, ఇంద్రియములును సన్మార్గమునఁ బోవునట్లు ప్రోత్సాహపఱుపుము. నాసత్ప్రయత్నములను వృద్ధిచేయుము, నాకు విధాయకమైన కార్యములను, ఉత్సాహముతోడను, బట్టుదలతోడను జేయునటులఁ బ్రసాదింపుము.

నేఁటికష్టసుఖములయందుఁ బ్రవేశించునప్పుడు, సమస్త భారములను నీయందు వేసి, నేను జేయు కార్యములను నీకుఅర్పితములు, చేయుదునుగాక! ఆకష్టసుఖములను వేసరక అనుభవించుటకు ఆయత్తుఁడనై యుండనిమ్ము.

నామనోవ్యాపారములు, సదా నీదివ్యచిత్తానుసారముగ నుండుఁగాక. నాహృదయమును నీయందలిభక్తితో నిండింతునుగాక.

హేయమైన ప్రీతిమోహపాశమును ఖండించి, నాయంతఃకరణములన్నియు నిన్నే తగిలియుండునట్లు చక్కఁపఱుపుము.

ఈప్రపంచకర్మములయందుఁబ్రవేశించియుండినను, వానివలన నామనస్సు ఉన్మత్తపడక నిన్నే యాశ్రయించునటులు శిక్షింపుము.

నీమీఁదిభక్తియను మేరువును ఆశ్రయించి, మాయయనెడి సుడిగాలికిఁ గొంచెమైనను జలింపకుందునుగాక.

నాజీవితకాలమును వ్యర్థపఱుపక నిన్నుఁజేరుటయే పరమపురుషార్థమని నమ్మి, దానికిఁదగునట్టికార్యములను ఒనర్పఁజేయుము.

ఓకరుణాకరా! నిత్యమిత్రుఁడవైన నీదుపాదారవిందములకుఁ బ్రతిదినమును మ్రొక్కి నిష్కళంకచిత్తుండనై నీమీఁదిభక్తిని బెంచి సుఖముగ బ్రతుకునట్లు దీవింపుము.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

ఉదయకాలపు వందనము.

ఓం పరమాత్మనే నమః.

---

కృపామయుఁడవైన ఓ దేవా! ఆహ్లాదకరమైన ఈసుప్రభాతమందు నిన్ను సేవింప మేల్కొనుచున్నాను.

గతరాత్రి నేను మైమఱచి నిద్రించునపుడు ఎట్టిప్రమాదములును సంభవింపకుండ సర్వరక్షకుఁడవైన నీవు నన్నుఁ గరుణతో రక్షించితివి. అందుకు భక్తివిశ్వాసభరితములైన స్తోత్రములను జేయుచు నీసన్నిధిని జేరి నీపాదారవిందములకు సాష్టాంగ దండప్రణామముల నాచరించుచున్నాను.

[ఇచ్చట భక్తుఁడు, ఈశ్వరుఁడు తనయెదుట అదృశ్యముగనున్నటులు భావించుకొని సాష్టాంగదండప్రణామమును జేసి ఈక్రిందవ్రాసినవిధముగఁ బ్రార్థనచేయవలయును.]

సర్వేశ్వరా! ఈదినమంతయును మఱియు నాశేషకాలములోని ప్రతినిమిషమును నీవు నాకు రక్షకుఁడవుగను మార్గదర్శివిగను ఉండుము. పిచ్చిభ్రమలును, అపభ్రంశములైన భ్రాంతులును, అపరిశుద్ధములైన కోరికలును, చెడుతలంపులును, నాకుఁ బుట్టకుండునట్లును, అనుచితసంభాషణలను, దుష్కార్యములను, నేను జేయకుండునట్లును, దయాళుఁడవైన తండ్రీ! నన్నుఁగాపాడుము. మఱియు నీదినమంతయు నీయాజ్ఞలను శిర

సావహించి నీదివ్యచిత్తానుసారముగ సంచరించునటులు ప్రసాదింపుము.

[పిమ్మట భక్తుఁడు లేచి ఈక్రిందవివరించిన ప్రకారము చెప్పుచు సర్వేశ్వరునకు అన్నిదిక్కులను వందనములను జేయవలెను.]

ఓవిశ్వేశ్వరా! ఈసువిశాలవిశ్వమందు నీవు అంతర్యామివై సర్వవ్యాపివై యున్నావుగాన నీకు దశదిశలయందును అసంఖ్యాతములైన వందనములను జేయుచున్నాను.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

---

ఉదయకాలపుఁ గుటుంబవందనము.

ఓం పరమాత్మనేనమః.

కాలస్వరూపివైన ఓదేవా! నీవు మాకు మరియొకదినము ననుగ్రహించినందుకు ఊర్ధ్వబాహులమై నీకు నమస్కరించుచున్నాము.

ఓలోకావనా! గతరాత్రి మేము శరీరస్మృతిలేక సుషుప్తినిజెందియుండినపుడు మమ్ము రక్షించినందుకు నీకు వందనములను జేయుచున్నారము.

ఇవుడు మేముపొందియున్న ఆరోగ్యమును, ఉత్సాహమునుగుఱించియు, మాబంధుమిత్రులతో మేము తిరిగి కలిసికొనుసంతోషమును గలుగఁజేసినందునకును, నేఁడు మేము అనుభవింపగల సుఖములనుగుఱించియు, నీకు వందనములిడుచున్నారము.

స్వప్రకాశుఁడవైన యోసృష్టికర్తా! గాఢాంధకారములో మునిగియుండు ఈజగత్తును బ్రకాశింపఁజేయుకొఱకు జగజ్జ్యోతియగు భాస్కరుని ఉదయింపఁజేసినందునకును, ప్రాణికోట్లు సుఖించుటకు నీవుకలుగఁజేసిన సకలపదార్థములనుగుఱించియు, నీకు జోహారుచేయుచున్నాము.

ఓపాపభంజనా! ఓదుఃఖార్తిహరణా! మమ్ములను మావారిని, పాపమును దుఃఖమును అంటకుండునటులుకాపాడుము.

ఓమంగళాకరా! నీకు మేమొనర్చినవందనార్చనలచే, ఈయుదయము మాకెట్లు సుప్రభాతమయ్యెనో, అట్లే ఈదినమును మాకృతజ్ఞతాసూచకములైన స్తోత్రములతో ముగిసి మంగళప్రదమగుఁగాక.

నమస్తే నమస్తే నమః

ఓం, తత్, సత్.

## ఉదయానంతరము చేయఁదగినప్రార్థన.

### ఓం పరమాత్మనేనమః.

ఓ తేజోనిధీ! నీమహిమావిశేషములను జూచుటకు నాకన్నులను దెఱచుచున్నాను. ఈప్రకృతియందు అంతర్యామివైయున్న నిన్నుదర్శించుటకును, నీప్రీతికొఱకై పాటుపడుటకును నిద్రమబ్బును విదలించుచున్నాను.

నాదృష్టి ఎటుప్రచరించినను నీసృష్టివైచిత్ర్యములే కన్నులపండుగఁ జేయుచున్నవి.

ఆహా! ఈసృష్టికి, ఉద్యద్దీపమువలెఁ బ్రకాశించు దేదీప్యమానమైన సూర్యప్రభ ఎంతరమ్యముగను దివ్యముగను ఉన్నది! నీలవర్ణముగల ఆకాశమును, అందుపరువిడుచున్న వెండికొండలవంటి మేఘపంక్తులును, ఎంతరమణీయముగనున్నవి! నీమహిమను బొగడుచున్నట్లున్న పక్షిరుతము ఎంతమనోరంజకముగనున్నది! గోగణంబులు ఎంతఉత్సాహముతో మేతకుఁబోవుచున్నవి! తరుగుల్మలతాపుష్పాదులు ఎంతమనోహరములుగనున్నవి!

ఓయఖండ సచ్చిదానందాద్వయ పరబ్రహ్మమా! నే నీయద్భుతసృష్టినిగమనించినపుడు, వేదములుఘోషించుచున్న నీసర్వశక్తి, సర్వవ్యాపకత్వము, సర్వజ్ఞత్వము, నిత్యత్వము, కరుణామయత్వము మొదలగు నద్భుతశక్తులు అనుభవగోచరములగుచున్నవి.

ఆనందాబ్ధిమగ్నుఁడనైన నేను దశదిశలనవలోకింపఁగ నావాక్కులు అప్రియత్నముగ నీమహిమను బొగడుచున్నవి. కృతజ్ఞత, ఆనందము, భక్తియును ముప్పిరిగొనుచున్నవి.

ఓహో! ఇట్టి పరమప్రేమాస్పదుఁడైన, సర్వేశ్వరుని మహిమను నాతోమేల్కొని ఎల్లదేశములవారును ఒక్కపెట్టున జయజయశబ్దములతో ఘోషింతురుగాక.

ఓదేవా! మాంద్యము, తామసము, కృతఘ్నత, నిర్దయ, ఇత్యాదిదోషములు నేఁడు నన్నావరింపకుండఁ గాపాడుము. కార్యవశమున నాతో గమనసంభాషణాది వ్యవహారములను జేయువారియెడల నేను, క్షమాస్వభావమును, మృదుత్వమును, సన్మానమును, హితబోధకత్వమును గలిగియుండునటులు ప్రసాదింపుము.

పాపమును అసహ్యించుకొనినను, పాపిని గనికరించి, వానికి సన్మార్గదర్శిగ నుండునట్టి ఔదార్యమును నాకుఁ గటాక్షింపుము.

స్థిరచిత్తముతో సంపూర్ణవిమర్శనముచేసినపైని, న్యాయమని నాయంతర్వాణి ఖండితముగను, నిస్సందేహముగను సూచించిన అభిప్రాయములను వక్కాణించుటయందును, అట్టికార్యములను నిర్వహించుటయందును, ఎట్టిఇడుమలు సంభవించినను వానినిఓర్చి నీసహాయమువలన జయోత్సాహములు కలిగియుండునటుల నాకనుగ్రహింపుము.

పురుషులను సోదరులుగను, స్త్రీలను సోదరీమణులుగ

ను, బిల్లలను మూర్తీభవించిన సాత్వికస్వరూపులుగను దలంచి ప్రేమించునట్టి సద్బుద్ధిని నాకొసంగుము

త్రిసంధ్యలయందును నీనామము నాచే జేగీయమాన మగుఁగాక.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

---

## సాయంకాలపు బ్రార్థన.

ఓం పరమాత్మనేనమః.

ఓజగదీశా! నేఁడు నీదాసునకుఁ బ్రసాదించిన, అనంత కారుణ్యముల నెంచి, అతివినయ వందనార్చనలతో, నీసామీప్యమును జేరుచున్నాను.

నేఁడు నేనుఅనుభవించిన ప్రతిసుఖమును, నేనుబొందిన ప్రతిశుభమును, నీయపారకరుణను దెలుపుచుచేయుచున్నవి.

నేఁడు నేనుబొందిన ప్రతికష్టము, పరాభవము, ఆశాభంగము, ఇత్యాదులగుకీడులు, నాపాపస్వభావమను రోగమును నివారించుటకొఱకు, కరుణతో నాకిచ్చిన వెగటైనమందులని భావించుచున్నాను.

నేఁడు నేను జేసినసర్వపాపములను నీవుఎఱింగియున్నావు.

నీయాజ్ఞలను నెఱవేర్చుటయందు, నేనెంతతప్పిపోయి యున్నానో దానినిసహితము నీవెఱింగియున్నావు.

పశ్చాత్తాపముచే మిక్కిలి పీడితుఁడనై, నిన్నుఁజేరిన నన్నుఁగగుణించి, నాపాపములకుఁదగిన ప్రతీకారములచేత నన్ను శిక్షించి, పావనునిఁగాఁజేసి, అవి మరల నన్నుఁజేరకుండునట్లు కాచిరక్షింపుము.

నేఁటికష్టసుఖములవలన అలసటఁజెందిన నేను సుఖనిద్రియందు నూఱటఁజెంద సెలవిమ్ము.

ఈనిద్రనుండి లేచిబ్రతికియుందునేని నానూతనవ్యాపారములను, నీకు అర్పితముచేయుదును.

అట్లుగాక, ఈరాత్రియే, ఈలోకమందు నాఅంత్యదినమయ్యెనేని, నాశరహితమైన, నీదివ్యలోకమందు, నన్నుమేలుకొలిపి, అనిత్యనిర్మలానందపదవిలో నాకుఁ జోటిచ్చి, రక్షింతువుగాక.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.



## సాయంకాలపుఁ బ్రార్థన.

ఓం పరమాత్మనే నమః.



దేశకాలావచ్ఛిన్నుఁడవయిన పరమాత్మా! జగజ్జ్యోతియగు సూర్యుఁడు అస్తమించి సంధ్యారాగము దేశమందంతటను వ్యాపించి క్రమముగఁజీకటులు గ్రమ్ముచున్నవి. ప్రాణికోట్లు తమతమవ్యాపారములనుమాని స్వస్థానములను జేరుచున్నవి. ఈపుణ్యకాలమున మరియొకసారి నాబుద్ధివృత్తులను నీపాదారవిందార్పితము చేయుచున్నాను.

పరమపవిత్రుఁడవైనదేవా! పాపిష్ఠుఁడనయిన నేను ఈదినము కాయికవాచికమానసికములైన కొన్నిదుష్కృతములను జేసి నీయప్రీతికిఁ బాత్రుఁడనైనాఁడను. (ఇక్కడ నేఁడు నీవుచేసిన ముఖ్యమైన అపరాధములను వక్కాణింపుము) అయినను నీపుత్రవాత్సల్యమునకు నేనుశరణాగతుఁడనైనాఁడను. గాన దయామయుఁడవైన తండ్రీ! నీశరణాగతరక్షకత్వమును బాటించి నన్నుక్షమింపుము. ఆపదుద్ధారకా! పాపపంకములోఁజిక్కుకొనిన నన్నుఉద్ధరింపుము, ప్రతినిమిషమును నన్నుఆకర్షించు కామక్రోధాదులకు లోఁబడక సదానీయాజ్ఞానువర్తినిగా నుండునట్టిమనోబలమును నాకుఁబ్రసాదింపుము.

కృపామయ! నేఁడు నీవునాకుఁగలుగఁజేసిన కృపావిశేషములనుగుఱించియు, గొంతవఱకైన నీకుప్రీతికరముగ నేను

జేసిన సత్కార్యములనుగుఱించియు, నేఁడునాకుఁగలిగిన జ్ఞానాభివృద్ధినిగుఱించియు, క్షణభంగురమైన ఈకళేబరమునకు ప్రతినిమిషమును సన్నిహితమైయుండు ప్రమాదములును ఆపదలును నన్నంటకుండఁగాపాడినందునకును, అత్యంతవినయముతో నేనుజేయువందనములను గరుణతోనంగీకరింపుము.

జగన్నాటకసూత్రధారీ! ఈదినమంతయు సంసారయాత్రను నడపివేసరి ఇపుడు నీబాహుమధ్యమున విశ్రాంతినిబొందఁగోరుచున్నాను.

ప్రసన్నాత్మా! నీప్రీతికొఱకు నేఁడు నేనుజేసినపని అత్యల్పమైయుండినను, ఇంతకంటె అధికశ్రద్ధాభక్తులతో నేను నీదాస్యమును జేయవలసియుండినను, నన్నునీదాసునిగనంగీకరించి నేనొనర్చిన సత్కార్యలేశమును నీకటాక్షదృష్టితోఁ జూచితివేని నన్నుగృతార్థునిగఁదలంచెదను.

సర్వసముఁడా! నేను సంసారయాత్రను నడుపునపుడు నీసాన్నిధ్యానుభవానందమును మఱవకుందునుగాక! నీధ్యానానందమునుమరిగి నీయాజ్ఞానుసారముగ నేనుజేయవలసిన పరోపకారాదిసత్కర్మలను యథావిధిగఁజేయ మఱవకుందునుగాక! నేను ఏకార్యమునుజేసినను నీయాజ్ఞానుసారముగను నీప్రీతికొఱకును జేయుదునుగాని మనుష్యమాత్రుని మెప్పఁబడయుటకుఁగాని నావేడుకనుదీర్చుకొనుటకుఁగాని చేయకుందునుగాక!

నీధ్యానాదికమును జేయునపుడుంబోలె, నీప్రజాసౌఖ్య

ముకొలకు పాటుపడునపుడును నీసాన్నిధ్యానుభవమును అను భవింతునుగాక !

సుషుప్త్యాద్యవస్థాత్రియాతీతా ! ఈరాత్రి నేనును నా బంధుమిత్రులును నిద్రించుతఱిని నీవుమమ్ము గాచియుండి పాపములును ఆపదలును మమ్ము అంటకుండ రక్షింపుము.

సత్యసంకల్పా! వేకువజామున నేను లేచునపుడు ఉత్సాహాముతో నీదాస్యమునకు సిద్ధపడునటులు ఈరాత్రి నేను సుషుప్త్యానందమును అనుభవించి బడలిక తీర్చుకొనుట నీసంకల్పమగుఁగాక !

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

---

## నిశీథినీ స్తవము.

ఓం పరమాత్మనే నమః.

ఓజగజ్జనకా ! అతినిశ్శబ్దముగనున్న ఈనిశీథినియందు, నేనత్యంత భయభక్తులతో నీపాదపీఠమును జేరుచున్నాను.

బ్రహ్మాండమంతయు నంధకారబంధురమైయుండి, జీవకోటి సుషుప్త్యవస్థయందు మైమఱచియుండునపుడు అమితదయాళుఁడవైన నీవు అనిమిషుఁడవై అరసి రక్షించుచున్నావు.

నీసత్యత్వము ఈయంధకార మంతటను వ్యాప్తమై యున్నది. నీప్రతాపము సూర్యచంద్రాగ్నులకుఁ బ్రకాశము నిచ్చుచున్నది. నీగాంభీర్యము అంధతమస్సుకంటెను నిబిడమై యున్నది. చూపరుల కాశ్చర్యకరమగు నక్షత్రమండలము నీ అద్భుతశక్తిని సర్వజ్ఞత్వమును బరమదయాళుత్వమును జాటుచున్నది. జ్ఞానచక్షువులుగలవారు నిన్ను అన్నిటియందును నీయందు అన్నిటిని జూచుచున్నారు. ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు నీయందె కలుగుచున్నవి. నీసాన్నిధ్యమనుభవించువారి కెట్టిభయమును గలుగనేరదు.

ఓదేవా! నాజన్మసాఫల్యమగు కార్యములను జేయుటకుఁదగిన శక్తియుక్తుల నాకొసంగుము. నీపరిశుద్ధత్వమును నా హృదయమునఁ జొనుపుము. నీశాసనములను నాయాత్మయందు నాటింపుము. కీడుమేళ్లయం దుదాసీనుఁడనై నీయందు ఆనందించునటులనుగ్రహింపుము. పర్యవసానము నాలోచింపక యేమిసంభవించినను సరేయని నీయాజ్ఞలను మన్నించునట్టి దృఢచిత్తమును గలుగఁజేయుము. నీప్రజాక్షేమముకొఱకు నా మానప్రాణములను సైతము తెగింపవలసినతఱిని ఇది పరమదయాళుఁడైన నాతండ్రియగు నీకు ప్రీతికరమగునను తలంపు క్షీణించుచున్న నాధైర్యమును బురికొల్పుఁగాక.

ఏదిలేకున్న జపతపాదులును, దానధర్మములును వ్యర్థములగునో, ఏదినీతత్వజ్ఞానమునకుఁ బునాదియైయున్నదో, అట్టిచిత్తశుద్ధిని బొందుటకు నేను శేయుప్రయత్నములను సఫల

ముచేయుము. నిర్మలభక్తిని, సుశీలతను, ఉపకారస్మృతిని, అపకారవిస్మృతిని, నాకుఁ గలుగఁజేయుము.

నాప్రాణాపదయందు ఈప్రపంచములో నాకత్యంత ప్రీతికరమైన సమస్తమును, నిర్విచారముగ నీపాదారవిందార్పితముఁ జేయుటకు నన్ను సిద్ధపఱుపుము.

ఓలోకావనా! నిద్రాపరవశులైన ప్రాణికోట్లను అనుగ్రహింపుము. నిద్రితులైన నాపుత్రమిత్ర కళత్రాదులను రక్షింపుము.

లోకంబులును, లోకేశులును, లోకస్థులునుగూడ లయమొందినపుడు, ఆలోకంబైన పెంజీకటిని ఏకాకృతివెలుంగు పరంజ్యోతీ! నీసచ్చిదానందత్వము నిరంతర జేగీయమానముగుఁగాక.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

---

భోజనమునకుఁబూర్వమునఁ జేయఁదగిన ప్రార్థన.

ఓం పరమాత్మనేనమః.

---

సమస్తప్రాణులకును యుక్తమైన ఆహారమును గల్పించి రాతిలోని కప్పకుసైతముఁ దగిన ఆహారమునిచ్చి జీవకోటినిభో

పించు ఓజగత్పితా! నీకరుణాకటాక్షముచే నేఁడు నాకుసమ కూడిన భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యములనెడి చతుర్విధ పదార్థములను కృతజ్ఞతతో భుజింప సెలవిమ్ము.

ఓదేవా! నేనుభుజించునపుడు నీదివ్యసాన్నిధ్యమును నాకుఁ గలుగఁజేసి నాహృదయమును ఆనందింపఁ జేయుము.

నేనుభుజించినను, ఉపవసించినను, ఏకార్యమును జేసినను, అవియన్నియు నీమహిమావర్ధకములగుఁగాక.

ఓసత్యస్వరూపా! నేనుభుజించుపదార్థములు నీమహిమచే అమృతమగుఁగాక.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.



భోజనానంతరముఁ జేయఁదగినప్రార్థన.

ఓం పరమాత్మనేనమః.



ప్రాణుల గర్భగోళములయందు జఠరాగ్నిరూపముగ నుండి, ప్రాణాపాన వ్యానోదాన సమానవాయువులతోఁగూడి, ప్రాణికోటి భుజించెడి చతుర్విధాన్నములను బచనముచేయు వైశ్వానర స్వరూపుఁడవైన ఓదేవా! నీకటాక్షముచే నేను భుజించిన పదార్థములను జీర్ణముచేసి, వానిరసములను నాకు పుష్టిప్రదములుగను ఆరోగ్యప్రదములుగను జేయుము.

మఱియు, ఆరసములు, నారాజసతామసగుణములను గృశింపఁజేసి సత్వగుణమును వృద్ధిచేసి నీదివ్యచిత్తానుసారముగ నాకు విధింపఁబడిన లోకోపకారాది సత్కర్మలను, నవీనమైన ఉత్సాహముతోఁ జేయుటకు సహకారులు అగుఁగాక.

ఓకృపామయా! నీవు నాకులభింపఁజేసిన ఈసత్పదార్థములను భుజించి, కృతజ్ఞతాసూచకముగ నేను జేయువందనములను గరుణతో నంగీకరింపుము.

ఇహమందు నీదివ్యనామమును జేగీయమానముగఁజేసి, పరమందు నీశాశ్వతానంద రసాబ్ధిలోనోలలాడునట్లు, నీకరుణామృత పానమును గూడ నాకుఁ గలుగఁజేయుము.

ఓదేవా! నీవు నాకు లభింపఁజేసిన ఇష్టపదార్థములను భుజించి తృప్తిబొందిన నేను క్షుద్బాధానివారణకొఱకు పట్టెడన్నమైనను లభింపని నిరుపాధికులైన రోగులను, నిరుపేదలను, గనికరముతోఁజూచి, నాశక్త్యనుసారముగ వారలక్షుత్తును నివారణచేసి సర్వహృదిస్థుఁడవైన నీకృపకుఁ బాత్రుఁడనగుదుఁగాక. మఱియు నిట్టిదురదృష్టవంతులను జూచినపుడు, నాకుఁగల ఆరోగ్యము, భాగ్యము, స్వతంత్రత, ఇత్యాదిసౌఖ్యములను గలుగఁజేసిన కరుణాసముద్రుఁడవైన నీయందు నా కృతజ్ఞత అపారమైయుండుఁగాక.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

---

## త్రిసంధ్యలను జేయవలసిన ప్రార్థన.

ఓం పరమాత్మనేనమః.

భూలోక, భువర్లోక, సువర్లోకాది సమస్తలోకములను నిండియున్న ఓంకారస్వరూపుఁడవైన పరమాత్మా! జీవకోటికిఁ జైతన్యమును గలుగఁజేయుచు దేదీప్యమానమై స్వప్రకాశమైన నీదివ్యతేజస్సును ధ్యానించుచున్నాము. నీవు మాబుద్ధివృత్తులను సన్మార్గమందు బ్రవర్తించునటులు ప్రేరేపింతువుగాక.

నమస్తే నమస్తే నమః

ఓం, తత్, సత్.

---

## సంపదలోఁజేయఁదగిన ప్రార్థన.

ఓం పరమాత్మనేనమః.

కరుణారసభరితుఁడవైన తండ్రీ! అధిభౌతిక అధిదైవిక అధ్యాత్మికములైన విపత్తులును గండములును నన్నంటకుండ రక్షించుటయెగాక, శరీరారోగ్యమును, భాగ్యమును, సత్సంతానాది సమస్తఐహికసుఖములనుసైతము నాకుఁగలుగఁజేసినావు ఇందుకు అత్యంతకృతజ్ఞతతో నీకు వందనములను జేయుచు, ఇవియన్నియు నిర్హేతుక జాయమాన కటాక్షముచే

నీవొసంగినవేయని నమ్మి సదాకృతజ్ఞుఁడనై యుండఁబ్రసాదింపుము.

తనువులు బుద్బుదములవలె క్షణభంగురములని నమ్మి ఈతనువున్నప్పుడే నిన్ను సద్భక్తితో నారాధించి, పాపక్షయముచేసికొని చిత్తశుద్ధిని జ్ఞానమునుఁబడసి నీపరమపదమునుబొందుటకుఁ బట్టుదలతోఁ బ్రయత్నించు చిత్తస్థైర్యమును నాకనుగ్రహింపుము.

ఈయావనావస్థయును ఈశరీరారోగ్యమును అస్థిరములుగాను ఇవియున్నప్పుడే పరోపకారార్థము పాటుపడవలయునను సద్బుద్ధిని నాకొసంగుము.

సిరి చంచల స్వభావముకలదనియు, దాను జేసిన విశ్రుతధర్మమే తనవెంటవచ్చునుగాని తానార్జించి నిలువచేసిన ధనముఁగాసువీసమైన దనవెంట రాదనియు నామనస్సున నాటించి నాభాగ్యమును బీదల సౌఖ్యాభివృద్ధికొఱకు వినియోగపర్చునటుల నన్ను బ్రేరేపింపుము.

నాజీవితకాలమంతయును, నాభాగ్య భోగ్యాదులన్నియును, నీమహిమాభివృద్ధికొఱకును పరోపకారముకొఱకును వినియోగపడునుగాక.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

## దారిద్ర్యము సంభవించినపుడు చేయఁదగిన ప్రార్థన.

ఓం పరమాత్మనే నమః.

దీనావనా! నేను సంపన్నుఁడనై యుండినపుడు ధనగర్వముచే విఱ్ఱవీఁగియుంటిని. నీయందు కృతజ్ఞతకలిగి నిన్నారాధించుచు, బేదలకు ఉపకారముచేయుచుండుటకు నీకటాక్షముచే ఆసంపద నాకు లభించెనని తెలిసికొనలేక, నిన్ను దలంపకయు, బేదలమొఱలను జెవిఁబెట్టకయు, ఐహికమిథ్యాసుఖములయందు నాభాగ్యమును వ్యర్థపఱచితిని.

ఇపుడు దారిద్ర్యాంజనముచే సంపన్నాంధత కొట్టఁబడి పోయినందున జ్ఞానచక్షువును దెఱచి, నాకృతఘ్నతకును, హృదయకాఠిన్యమునకును, నన్ను నేనేగర్హించుకొనుచుఁ బశ్చాత్తాపము నొందుచున్నాను.

సంపన్నాంధతచే నేను అధోగతిపాలుకాకుండ యుక్తకాలములో నాకీ దారిద్ర్యాంజనము నొసంగి రక్షించిన నీయీజీవదయాపరత్వమునకు, నీకు అనేకవందనములను జేయుచున్నాను.

ఈనురవస్థ ముందు నేనుసత్ప్రవర్తనపరుఁడనై యుండుటకును, అశాశ్వతములైన ఇహసౌఖ్యములయందు నాకు రోఁతపుట్టుటకును, బుతుని శ్రేయస్సుకొఱకు, అతనిమేలునే సదాచింతించుచుండు తండ్రిచేయు దండనయని నమ్మి, నీకు సదా వందనీయుఁడనై యుండునటులనుగ్రహింపుము.

ఇట్లు శ్రేయస్కరమైన ఈదండనను ఓర్పుతో భరించునట్లును, నీయందు శాశ్వతానందదాయినియైన నిశ్చలభక్తిని, ఒగులకష్టసుఖములను దనవిగా భావించుభూతదయను, సుఖదుఃఖాదిద్వంద్వములలో ఎప్పుడు ఏవిసంభవించినను అవి నాకు శ్రేయస్కరములేయని నమ్మి నీకు సదావందనీయుఁడనై యుండు సమబుద్ధిని, ఓదీనదయాపరమూర్తీ! నాకుఁ బ్రసాదింపుము.

దేవా! నీదివ్యచిత్తానుసారముగ, మరల నేనెన్నఁడైన ధనవంతుఁడనైతినేని, ఇపుడు నీవు పితృవాత్సల్యముతో నాకు జేసిన శిక్షయును, అందువల్ల నాకుఁగలిగిన సునిశ్చయములును నాహృదయమున నాటియుండి, నాభాగ్యమును నీమహిమాభివృద్ధికొఱకే వినియోగపర్చుదునుగాక,

నమస్తే నమస్తే నమః.
ఓం, తత్, సత్.

---

## వార్ధక్యములోఁ జేయఁదగిన ప్రార్థన.

ఓం పరమాత్మనేనమః.

---

దేవా! నేను యౌవనావస్థయందుండినపుడు కండకావరముచే గ్రిందుమీఁదుచూడక యుంటిని. అప్పటినాదేహదార్ఢ్యమును, ఆరోగ్యమును, ఓపికతో నిన్నారాధించుటకును,

పరోపకారార్థమై పాటుపడుటకును, అనుగ్రహపూర్వకముగ నీవు నాకొసంగినవనియు అవి యశాశ్వతములనియు దెలిసికొనలేక కామోపభోగరతుఁడనై, నిన్ను భక్తితోఁదలంపక, మితిమీఱిన నాకోర్కులను నెఱవేర్చుకొనుటకై ఎవ్విధముగనైన ధనమార్జించుచు, బరపీడనమునకు భయపడక యిచ్ఛలవిడిగ సంచరించితిని.

ఇపుడు జరారుజలచే ఇంద్రియములు శోషించి జవసత్వములుడిగి, చేయునది లేక ఆపద్బాంధవుఁడవైన నిన్ను శరణుచొచ్చుచున్నాను.

శరణాగతపోషా! దుష్టుఁడనని నన్ను విడనాడక జ్ఞానదృష్టినొసంగి, నాపాతకములను, దీవ్రసంతాపాగ్నియందు దగ్ధముచేసి, నీపతితపావనత్వముచే నన్ను పునీతునిచేసి రక్షింపుము. పుత్రమిత్రకళత్రాదులయందలి మోహపాశములను ఖండించివేయుము. ధనార్జనయందు నాకుగల తృష్ణనుడిగింపుము. కలిగినదానితోఁ దృప్తిఁబొంది, దానిని బీదలతో పంచికొనుచునట్టి సద్బుద్ధిని నాకొసంగుము. నాదేహస్థితి అవకాశమిచ్చునంతవఱకు లోకోపకారమునకై పట్టుదలతోఁబాటుపడునట్టి ఉత్సాహమును నాకుఁగలుగఁజేయుము. నాశరీరమందుఁ బొడముహ్యాధులును నామనస్సునకుఁగలుగుసంతాపమును నాకుసంభవించు ఆపదలును పరాభవములును నాకు సంసారమందు రోఁతపుట్టించుటకును నీయందు నాకుగలభక్తివిశ్వాసములను బరీక్షించుటకును దృఢపఱుచుటకును అనన్యగతికుఁడనై నిన్నే ఆశ్రి

యించుటకును, నాయహంకారాభిమానములు నశించుటకును కరుణార్ద్రహృదయుడవై నీవుచేసిన మహోపకారములని నమ్మి నీకు సదాదాసుఁడనై యుండునటులు ప్రసాదింపుము.

సర్వేశ్వరా! యుక్తకాలములో నాలౌకికవ్యవహారములను జక్కఁబఱచుకొని, నాకు అపకారముచేసినవారిని మనఃపూర్తిగ క్షమించి నేను ఏవిధముగనైన అపకారముచేసినవారి క్షమను వేఁడికొని, నాపాపములకుఁదగిన ప్రాయశ్చిత్తమును జేసికొని, సర్వసంగపరిత్యాగముచేసి, నీయాజ్ఞను ప్రతీక్షించుచు ఏకాగ్రచిత్తముతో నీపాదారవిందములయందు దృష్టినినిలిపి నీసన్నిధిని జేరునటులు ప్రసాదింపుము.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.



## ప్రబలరుగ్ణతలోఁ జేయఁదగిన ప్రార్థన.

---

ఆర్తరక్షకుఁడవైన పరమేశ్వరా! ప్రబలరుగ్ణతతోఁ బీడితుడై యున్న నీదానునకు (రోగినిపేర్కొనుము) నీకరుణామృతరసాయనముచే నారోగ్యమును గలుగఁజేయుము.

అట్లుచేయుట నీదివ్యచిత్త సంకల్పానుసారము కాని యెడల ఈశ్రమను అతనిమంచికొఱకే నీవు గలుగఁజేసినట్లు

నమ్మి దానిని ఓరిమితో భరించు ధైర్యమును అతనికి గలుగఁ జేయుము.

తాను జేసిన పాపములనుగుఱించి పరితాపమునుబొంది క్షమింపుమని పరమవాత్సల్యముగల తండ్రివైన నిన్ను వేడు కొనునట్లును దనకు అపకారముచేసినవారిని మనఃపూర్తిగఁ దానుక్షమించి, తనవల్ల అపకారముపొందినవారి క్షమను దీన త్వముతో వేఁడికొని స్వచ్ఛచిత్తుఁడగునట్లును అతనికిఁ బ్రసాదిం పుము.

పుత్రమిత్రకళత్రాదులు క్షణభంగురమైన ఈదేహమున కుబంధువులుగాని శాశ్వతమైన ఆత్మకుబంధువులు కారనియుఁ దానార్జించినధనములో లేశమైనఁ దనవెంటరాదనియు నిశ్చ యించుకొని వానియందు హర్షశోకమోహాదులను ద్యజించు నటులతని కనుగ్రహింపుము.

ఇతరచింతలుమాని నిర్మలచిత్తముతో నీపాదారవిందా ములయందుఁ దనమనస్సును లగ్నముచేసి జన్మమృత్యుజరా వ్యాధి ఘోరసంసార సాగరోత్తారకమగు దివ్యజ్ఞానమును బడసి నీపరమపదమును బొంది బ్రహ్మానంద రసాబ్ధియందు ఓలలా డునటులతనిని గటాక్షింపుము.

నమస్తే నమస్తే నమః

ఓం, తత్, సత్.

వివరణము—రోగి స్వయముగ నీప్రార్థనను జేయవ

మర్థతకలిగియుండెనేని అతఁడు ఈప్రార్థనను జేయవలెను. అ ట్లుచేయునపుడు «తన» «అతని» అనుమాటలకుబదులు «నా» అనియును «తాను» అనుమాటలకు «నేను» అనియు «అతనిని» అనుచోట «నన్ను» అనియు మార్చవలయును.

---

## సర్వకాలములయందుఁ జేయఁదగిన ప్రార్థనలు.

ఓం పరమాత్మనేనమః.

సర్వకాలములయందును సర్వదేశములయందును యోగులు, జ్ఞానులు, పామరులు, అనుభేదములేక సర్వజనులచేఁ బూజింపఁబడుచుండు ఓలోకపితామహా, అద్వితీయపరబ్రహ్మమా, మహాప్రభూ, స్వామీ!

చరాచరాత్మకంబగు ఈసృష్టికి నీవు ఆదికారణుఁడవు; నీమహిమను నీపరమభక్తులు సహితముఁ గించిన్మాత్రమే తెలిసికొనఁగలరు.

అజ్ఞానాంధతచే నేనుగనిపెట్టలేకయున్నను నీవు సదా నాకు మేలునే చేయుచున్నావు.

నీసాన్నిధ్యమునుబొందుటకు వలయుపనులనే నేనవలంబించి నీదయకు నన్ను దూరపఱచుకార్యములనుద్యజించునటుల నామనస్సాక్షి నాకెల్లప్పుడు నుపదేశించునుగాక.

నిర్హేతుకజాయమాన కటాక్షముచే నీవునాకొసంగిన యేసుఖమునైనను నేను నిరసింపకుందునుగాక. నేను అట్టిసుఖమును ఉచితరీతి ననుభవించుటయే నీకు ప్రతిఫలము. అదియే నీదివ్యచిత్తానుసారముగ సంచరించుట.

ఏవిషయమందైనను నేను మంచిత్రోవ తొక్కినయెడల అట్టిత్రోవను విడువకుండు దృఢచిత్తమును నాకొసంగుము. దేనిలోనైనను నేను దప్పుత్రోవ త్రొక్కితినేని దానినివిడిచి మంచిమార్గమునఁ బ్రవేశించు సద్బుద్ధిని నాకొసంగుము.

దయాళుఁడవైన నీవు నాకోర్కెలను ఈడేర్చినచో గర్వమునొందకుండను సర్వజ్ఞుఁడవైన నీవు నాక్షేమమునరసి నాకోర్కెని దేనినైన నొసంగనిచో అసంతుష్టినొందకుండను బుద్ధివివేకమును బ్రసాదింపుము.

పరులయాపదలకు నాయాపదలవలెఁ బరితపించునట్లును ఒరులతప్పిదములను నిర్నిమిత్తముగఁ బ్రచురముచేయకుండునట్లును నామనస్సును శుభ్రపఱుపుము. నీకృపను విశేషముగాఁ గోరు నేను ఇతరులయందు గృపగలిగియుందునుగాక.

నేనెంత అయోగ్యుఁడనయినను బరమపావనుండవైన నీవలన సృజింపఁబడితినిగాన గేవల వ్యర్థుఁడను గానేరను. నేఁడు నేను జీవించియుండినను మృతినొందినను నేనెచటికి బోవలసినను నీవే నాకు మార్గదర్శివై యుండుము.

నేఁటికి నాకింత అన్నమును, రాగద్వేషములు లేమిచేఁ గలుగు స్వస్థచిత్తమును గలుగఁజేయుము. ఇతరసౌఖ్యములలో

ఏదినాకు క్షేమకరమో ఏదినాకు బాధాకరమో సర్వజ్ఞుఁడవైన నీకు విశదముగాని కించిజ్ఞుఁడనైన నాకు అగోచరము. కావున వానినిగూర్చి నీదివ్యచిత్తానుసారముగనే జరుగునుగాక.

నమస్తే నమస్తే నమః,

ఓం, తత్, సత్.

---

ఓం పరమాత్మనేనమః.

దివ్యుఁడవైన ఓతండ్రీ! నీవు చరాచరాత్మకంబగు ఈప్రపంచమునకు అధీశుఁడవు, సర్వశక్తుఁడవు, సర్వవ్యాపకుఁడవు, సర్వజ్ఞుఁడవు, పరమదయాళుఁడవు. నీమహిమ అవాఙ్మానస గోచరము. కించిజ్ఞుఁడను పాపిని అయిననేను నీమహిమను దెలిసి వర్ణింప నెంతవాఁడను.

నీపతిత పావనత్వమును బ్రకటించి నాపాపచింతలను దొలఁగించి నాహృదయమును పావనముచేసి నాహృదయకమల కర్ణికాపీఠమందు అధిష్టించి నాకర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, మనోబుధ్యహంకారాదులను నీయాజ్ఞానుసారముగ జరించునటులు పరిపాలనజేయుము.

నాచిత్తవృత్తిని నీదివ్యచిత్తానుసారిణిగఁజేసి దానియందైక్యపఱుపుము.

నీకరుణయను నాయుధముచేఁ గామ క్రోధ లోభ మోహ మద మత్సరములనెడు నాలరిషడ్వర్గములను ఖండించి వేయుము.

నీకటాక్షవీక్షణమను వాయువును బురికొల్పి నాపాప రాశిని నాపశ్చాత్తాప దవానలమందు దహింపఁజేయుము.

అజ్ఞానాంధకారముచేఁగన్నుగానక సన్మార్గమునువదలి పాపసముద్రమందు మరల జారకుండునటులు జ్ఞానాంజనము నొసంగుము.

నీయందు అచలమైన నిర్మలభక్తిని, శీతోష్ణాదిసుఖ దుఃఖములయందు సమబుద్ధిని, శమదమాదిగుణసంపత్తిని, జీవ కోటియందు అపారకరుణను, నాకు అనుగ్రహింపుము.

సర్వాంతర్యామిత్వముచేత సమస్తప్రపంచమును నిండి యుండిన ఓదేవా! నీకు ముందును వెనుకను అన్నిదిక్కుల యందును వేయివేలవందనములను జేయుచున్నాఁడను.

నీనామము జగజ్జేగీయమానమై యుండునుగాక.

నమస్తే నమస్తే నమః శాన్తిశ్శాన్తిశ్శాంతిః.

ఓం, తత్, సత్.

ఓం పరమాత్మనే నమః.

అనంతశక్తిగల ఓభగవంతుఁడా! సమస్తవాంఛలను సంగెడి తండ్రీ! నాహితములను బోధించెడి సద్గురూ! నా శ్రేయస్సును సత్యముగా సూచించెడి జ్ఞానమును వృద్ధిచేయుము.

అట్టిజ్ఞానద్యోతకములగు కార్యములను దప్పక చేయు మనోదార్ఢ్యమును నాకొసంగుము.

నీప్రజాసౌఖ్యముకొఱకు నేను జేయుకార్యములే నీవు నాకు ఎడతెగక చేయుచుండుమేలునకు ఉచితభక్తిగ నేను జేయఁగల ప్రతికృతిగ నంగీకరింపుము.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.

---

ఓం పరమాత్మనే నమః.

ఓసృష్టికర్తా! తేజోనిధీ! పరమేశ్వరా! ప్రత్యంశమందును గర్తవ్యమును నాకెఱిఁగింపుము. మఱియు నీదివ్యచిత్తమును నాకుఁదేటపఱిచి నామనోవాక్కాయకర్మలయందు నీదివ్యచిత్తానుసారముగఁ జరించునట్టి సద్బుద్ధినాకొసంగుము.

అతిచంచలమును, అస్థిరమును, దుర్నిగ్రహంబును

నగు నామనస్సును నీపాదారవిందములయందు బంధించివేసి నీనిశ్చలధ్యానయోగమును నాకొసంగుము.

జీవహింస, అసత్యము, దుశ్చింత, ఇత్యాదిపాపముల నుండియు, గర్వమునుండియు, అవివేకమునుండియు నన్ను విడిపింపుము.

జ్ఞానము, శమదమాదులు, పరిశుద్ధాంతఃకరణము వీని వలన గలుగునిర్మలశాశ్వతానందమును నాకొసంగుము.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.



ఓం పరమాత్మనే నమః.



ఓ ఆపద్బాంధవా! శరణాగతపోషా! అనాథరక్షకా! దీనమందారా! భక్తవత్సలా! కరుణాసముద్రా! నన్ను నీకరుణార్ద్రదృష్టితోఁ జూడుము. నాకు నీఅభయహస్తమొసంగుము. నన్ను నీదాసునిగఁ జేసికొనుము. నాప్రార్థనలను గరుణతో నంగీకరింపుము.

నేను సర్వకాల సర్వావస్థలయందును నీపాదారవింద ధ్యానమును జేయుచుఁగాని నీదివ్యనామామృతమును గ్రోలుచుఁగాని నీపుణ్యకథలను వినుచుఁగాని నీదాసులతో గోష్ఠిసలు

వుచుఁగాని నీప్రజాసౌఖ్యమునకు వలయుపనులను జేయుచుఁగాని నాకాలమును గడపునటులు ప్రసాదింపుము.

నాకుటుంబమువారినందఱిని నీదాసానుదాసులుగఁ జేసికొని వారలను సర్వవిధముల రక్షింపుము.

(ఇక్కడ భక్తుఁడు అప్పటి తనఅవస్థను సమయమును బట్టి తనకుఁగావలసిన సద్గుణవృద్ధి దుర్గుణనిరసనము సంశయనివృత్తి హితబోధ ఇత్యాదిమనోభీష్టములను దనకుఁగలిగిన మేలును దానుబొందినకీడును దండ్రితోఁ బుత్రుఁడును భర్తతో భార్యయును సఖునితో సఖుఁడును జెప్పుకొనురీతిని జెప్పుకొని వానికిఅనుగుణముగఁ బ్రార్థింపవలయును.)

ఓతండ్రీ! నేనుజడుఁడను, నియమవర్జితుఁడను, చపలచిత్తుఁడను, ఇంద్రియలోలుఁడను, కామ క్రోధ లోభ మోహ మదమత్సరములచే నీడ్వఁబడుచున్న వాఁడను, మహాపాపిని, మహాపరాధిని, అయినను అహంకారమమకారములచే గర్వమును అతిశయమును బొందుచున్నాను; అట్టిగర్వమును అతిశయమును నిర్మూలముచేయుము. మరియు అతిదీనభావముతో దీనవత్సలుఁడవగు నీపాదారవిందముల నాశ్రయించి నీదాసానుదాసుఁడనై యుండి లోకులయెడల అడఁకువయును నమ్రతయును వినయవిధేయతలును గలిగి నడుచుకొనునటుల నుగ్రహింపుము.

నీవుసర్వజ్ఞుఁడవు, పరమదయాళుఁడవు. నీబిడ్డనగు నాకు నిర్నిమిత్తముగా ఆయాసము కలుగనీయవు. కావున సుఖ

దుఃఖములు లాభాలాభములు జయాపజయములు కీడుమేళ్లు ఇత్యాది ద్వంద్వములలో ఎప్పుడు ఏదితటస్థించినను దానిని నీమహాప్రసాదమని యెంచి సమబుద్ధితో ననుభవించునట్టి మనోదార్ఢ్యమును గలుగఁజేయుము. నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.



ఓం పరమాత్మనే నమః.



ఓ అప్రమేయ అద్వయపరబ్రహ్మమా! సచ్చిదానంద స్వరూపా! సృష్టిస్థితిలయకారణభూతా! సర్వాంతర్యామీ! పరమాత్మా! పరంజ్యోతీ! పరంధామా! పరాత్పరా! పరాకాశా! పరేశా! సనాతనా! ఆదిమధ్యాంతరహితా! ఆదిపురుషా! పరమపురుషా! మహాపురుషా! భక్తవత్సలా! భక్తపరాయణా! భక్తచింతితార్థప్రదాయకా! భక్తార్తిహారణా! భక్తబంధూ! భక్తరక్షకా! భక్తపోషకా! దీనబంధూ! దీనపోషకా! దీనావనా! దీనమందారా! దీనపరాయణా! కృపామయా! నేను పాపములలోఁబుట్టి పాపములలోఁబెరిగి పాపకర్మలను జేయుచుండెడి పాపస్వభావముగల మహాపాపిని. అయినను నీవేనాతల్లివి, తండ్రివి. నీవే నాతోడునీడ నీవేసఖుఁడవు గురుఁడవు, దైవము. నీవేనాపతియు, గతియు, అనినమ్మి రాత్రిందివములు అనన్యగతికుఁడనై నిన్నే శరణుజొచ్చిన నేను రేయింబగళ్లు కరచరణాదులను గర్మేంద్రియముల చేతను శ్రవణ

నయనాదులగు జ్ఞానేంద్రియములచేతను మనోబుద్ధ్యహంకారాది అంతరింద్రియములచేతను ఎడతెగక చేయు అసంఖ్యాతములైన అపరాధములను క్షమించి నాపాపములను రూపుమాపి నన్ను రక్షింపుము.

నాకుసదా నీపాదకమలసేవయు నీపాదార్చకులతోడి సెయ్యమును అపారభూతదయయును దయచేయుము.

మఱియు దైన్యములేనిజీవనమును అనాయాసమరణమును నీయందుఎడతెగని నిర్మలభక్తిని నాకుఁగృపతో నొసంగుము.

వెయ్యేల? నేనునీకు శరణాగతుఁడను, భక్తుఁడను, పరమపదవిని గోరుచున్నాను. నన్ను శుభదృష్టితోఁజూచి ఏది సర్వోత్కృష్టమైనమేలో దానిని నాకుఁగలుగఁజేసి రక్షింపుము.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్, బ్రహ్మార్పణమస్తు.

---

## అర్చన.

---

పరమాత్మా! సర్వవ్యాపివైన నిన్ను ఆవాహనచేయుట ఎట్లుసంభవమగును? సర్వమునకు నాధారమైయున్న నీకు ఆసనము ఎట్లువేయనగును?

పరమపవిత్రుఁడవైన నీకు అర్ఘ్యపాద్యాదులేల? శుద్ధుఁడవైన నీకు ఆచమనమేల? అతినిర్మలుఁడవైన నీకుస్నానమెందుకు? విశ్వగర్భుఁడవైన నీకువస్త్రమెట్లుసమకూర్చెదను?

నిరాలంబుఁడవైన నీకు ఉపవీతమేల? ఏవాసనలులేని నీకు పుష్పవాసనలేల? నిర్లేపుఁడవైన నీకు సుగంధలేపములేల? లావణ్యనిధివైన నీకు ఆభరణమేల? నిత్యతృప్తుఁడవైన నీకు నైవేద్య తాంబూలములేల?

అనంతుఁడవైన నీకు ప్రదక్షిణ మెట్లుచేయనగును? అద్వయుఁడవైన నీకు నమస్కారమెవరుచేయుదురు? వేదవాక్యములకైన అవేద్యుఁడవైన నిన్నెటులుస్తోత్రముచేయనగును? స్వయంప్రకాశుఁడవైన నీకు నీరాజనమెందుకు? లోపలను వెలుపలను అంతటనునిండియున్న నిన్ను ఎక్కడికి ఉద్వాసన సేయఁగలను?

కావున నిత్యశుద్ధ పరిపూర్ణ సచ్చిదానందాద్వయా! నిన్ను షోడశోపచారములచేఁ దృప్తిఁబొందింపఁ బ్రయత్నించుట వెలితనముగాదె?

అయినను అజ్ఞానాంధతచే దేహమే తానని తలంచి భేదబుద్ధితోఁ జూచుచు సంసారసాగరమగ్నులైన పామరులను దరింపజేయఁదలఁచి భక్తరక్షణపరాయణుఁడవైన నీవు సగుణివై మూర్తీభవించి «పత్రంపుష్పంఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతితదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః» అని యానతిచ్చితివిగాన నీయందు మనస్సునిలుపుటకును నీయందలి భక్తిని విస్తరింపఁజేయుటకును సహకారిగఁ ద్రికరణశుద్ధిగనే నొనర్చు షోడశోపచారయుక్తమైన అర్చనను గరుణతో నంగీకరింపుము. నమస్తేనమ స్తేనమః. ఓం, తత్, సత్.

## ఈశ్వరపారతంత్ర్యము.

పరమేశ్వరా! నిన్నేమి వేడవలయునో నేనెఱుంగను, నాలోపములు నీకే తెలియును.

నేను నీకుశరణాగతుఁడనై తినేని నీకు నాయెడలఁగలుగు వాత్సల్యము నాకు నాయందుఁగల ప్రేమను మించియుండును.

ఓతండ్రీ! నీబిడ్డనగు నాకు దేనినొసంగుట యుక్తమని నీకుఁదోఁచునో దానినే యొసంగుము. అది కీడుకానిమ్ము మేలు కానిమ్ము.

సుఖదుఃఖములలో దేనినిగోరుటకును నేను సాహసింప లేను. నేను నీసన్నిధిని నిలిచి నాహృదయధర్మమును నీకుబ యలుచేసెదను, నాకగోచరములగు నాలోపములను నీవేకని పెట్టి చేయవలసినపనిని నీకృపాళుత్వానుసారముగఁ జేయుము.

సర్వేశ్వరా! నీవు నన్ను శిక్షించిననుసరే, క్షమించి ననుసరే, లాఘవపఱచిననుసరే, గౌరవపఱచిననుసరే, నీసం కల్పములు ఎట్టివైనను నేను మాఱుమాటాడక వానిని మహా ప్రసాదములని శిరసావహించెదను. «నేను» «నాది» అనుదా నిని సర్వమును నీకు అర్పితముచేసి నేను ఉదాసీనుఁడనై యు న్నాను.

నమస్తే నమస్తే నమః.

ఓం, తత్, సత్.




# పాపక్షయపాపనివృత్తులు.

## అవతారిక.

1. మహామహులైన మనబుషులు పాపక్షయముకొ అకు ఆయాపాపములకుఁ దగిన ప్రాయశ్చిత్తములను, వేరు వేరుగ విధించియున్నారు.

2. ఇవి, కృఛ్రములు, చాంద్రాయణములు, వివిధదానములు, జపహోమాదులు, అన్నశాంతి మొదలగునవి. వీనిలోఁజాలభాగము ద్రవ్యసాధ్యమును ఇతరులసహాయమును నపేక్షించునదియు, కాలవ్యయమును జేయునదియు, అయ్యున్నది.

3. ఇవి విధింపఁబడినకాలములో ఇనిసులభముగ ఆచరింపఁబడఁదగిన ప్రాయశ్చిత్తములై యున్నను ధనలోపము, ఆచార్యలోపము, ఉద్యోగాదివ్యాపారములచేఁగలుగు స్వాతంత్ర్యలోపము, ఇత్యాదిప్రతిబంధకములుగల ఈకాలప్రజనులకు ఇట్టిప్రాయశ్చిత్తములను జేసికొని పాపక్షయముచేసికొనుట ఇంచుమించుగ నసంభవమనవచ్చును.

4. ద్రవ్యసాధ్యములగు ప్రాయశ్చిత్తములు ద్రవ్యహీనులకు సులభములుగావు. విశేషద్రవ్యవంతులకు వానివలన నెట్టిమనోవ్యథయుఁ గలుగనేరదు.

5. ఈకాలములో ధర్మశాస్త్రజ్ఞానముగల పురోహితులు దొరకుటఅరుదు; గాన ఆచార్యసహాయము నపేక్షించు ప్రాయశ్చిత్తములను జేసికొనుట దుర్ఘటము.

6. "కాలమేధనము" అని భావించి సర్వదా పాటువడుచుండినఁగాని జీవనోపాధికలుగని ఈకాలమునకు గాలవిక్షేపములగు కర్మలనుజేయుటకు అవకాశముచాలదు

7. ఈయుగమందు ప్రాణములు అన్నగతములు; శరీరములు రోగపీడితములు; ఆయువు అల్పము పరాకాష్టప్రాజ్యము; చాంచల్యము అధికము; కావున ఉపవాసాది తపోనిష్ఠలతోఁగూడిన ప్రాయశ్చిత్తములు సామాన్యముగ ఆచరణీయములుకావు.

8. ప్రకృతమందు మనవారుచేసికొను ప్రాయశ్చిత్తములు ముఖ్యముగ వేదశాస్త్రపురాణాదులవలన విధింపఁబడిన కర్మలలోఁగలుగులోపములు; జాత్యంతరులతో భోజనముచేసినవారు సముద్రయానముచేసినవారు శివార్చకులు మొదలగు అపాంక్తేయులుగఁ దలఁపఁబడినవారితోఁగాని, వారితో సహపంక్తిచేసినవారితోఁగాని సహపంక్తిచేయుట; ఇట్టికులాచారమతాచార విరుద్ధకార్యములకే అయ్యున్నవి.

9. జాతిభేదము మతభేదము ఇత్యాదిభేదములలో ని మిత్తములేక కేవలమనుష్యధర్మమునుబట్టి మనుష్యమాత్రు లందఱును సామాన్యముగ అనుష్ఠింపవలసిన సత్ప్రవర్తనకు విరుద్ధములైన దుశ్చింతలు దుర్వాక్యములు దుష్కార్యములు వీనినిగుఱించి మనవారు ప్రకృతమందు ప్రాయశ్చిత్తములనాచరించుట అంతగాఁగనఁబడదు.

10. అయినను కృఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్తములు ఈకాలమునకు సూటైనవి కావుగనుక వానినిగుఱించి ప్రకృతమందు విశేషముగ జర్చింపఁబనిలేదు.

11. పాపముఅనునది చిత్తశుద్ధిలోపమువలన మనోవాక్కాయకర్మలలో దేనిచేతనైనఁ జేయఁబడు ఈశ్వరాజ్ఞోల్లంఘనము అనిచెప్పఁబడవచ్చును.

12. «మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః» అనుశ్రుతివచనముప్రకారము బంధరూపముగఁ బరిణమించుపాపమునకును పాపక్షయమైనపిమ్మట క్రమక్రమముగ గలుగుమోక్షమునకును మనస్సేప్రధానముగనుక పాపక్షయమునకై మనముచేయు ప్రాయశ్చిత్తము మనశ్శుద్ధిసేయునది అయ్యుండవలెను. మనస్సునకునాటి మనస్సును బరితపింపఁజేసి మనస్సునుగరఁగించి మనోధర్మమును సవరణచేయఁగల ప్రాయశ్చిత్తమే మనస్సును శుద్ధిచేయఁదగియున్నది. కాఁబట్టి మానసిక ప్రాయశ్చిత్తమునుగుఱించి మనమిపుడు ముఖ్యముగ నాలోచింపవలసియున్నది.

13. ఇటులు చెప్పుటవలన మన పెద్దలు నిర్ణయించిన కర్మరూపకములైన ప్రాయశ్చిత్తములను మానవలసినదని నా అభిప్రాయముకాదు. అవియును బరోక్షముగ అంతశ్శుద్ధిని జేయునవియే. ధనవ్యయమువలనఁగాని ఉపవాసాదితపస్సులవలనఁ గలుగు క్లేశమువలనఁగాని ఆపాపమును జేయఁబట్టి ఈవ్యయము ఈక్లేశము కలిగినదని మనస్సునొచ్చి ముందు ఇట్టిపాపములను జేయఁగూడదని మనోనిశ్చయము కలుగవచ్చును. గనుక అవకాశమున్నంతవఱకు అట్టికర్మలను జేయుచు వానికిజోడింపుగఁ గాని అట్టికర్మలను జేయుటకు సమకూడనప్పుడు అందుకుబదులుగఁగాని ఈసంచికలో వివరింపఁబడిన మానసిక ప్రాయశ్చిత్తమును దప్పక చేసికొని మనశ్శుద్ధిని జేసికొన బ్రయత్నింపవలయును.

14. ఋషులును విశేషకాయక్లేశమును గర్మబాహుళ్యమును లేకయే పాపక్షయము గలుగుటకు గొన్నిమంత్రపఠనలను ఏర్పఱచినారు. సంధ్యావందనములో మనము పఠించు «ద్రుపదాదివము ముచానః» «అగ్నిశ్చమామన్యశ్చ» «సూర్యశ్చ మామన్యశ్చ» «అపః పునంతు పృథివీం» ఇత్యాది మంత్రములును «పాపోఽహం పాపకర్మాహం» «కరచరణకృతం వా» ఇత్యాదిశ్లోకములును ఇందునకు ఉదాహరణలు. ఇవి యొకవిధమైన పశ్చాత్తాపరూప ప్రాయశ్చిత్తములనఁబడవచ్చును. వీనిని పఠింపఁదగినవారు వీనిని నిత్యమును పఠింపవలసినదే. అయినను, ఈమంత్రాదులలోఁ జాలభాగము జటిలమైనపదములును గూఢమైనఅర్థములును గల సంస్కృతమందు దేశభా

ష కాబట్టి సంస్కృతములో నుండుటచేత వీనిని సాధారణముగ గుడ్డిపాటగఁ బాడుటయే జరుగుచున్నదిగాని వీనిఅర్థమును గ్రహించుటయును అందువల్ల మనస్సుకరఁగుటయును సాధారణముగ సంభవించుటలేదు. ఆయామంత్రపాఠకులయొక్క అంతరంగస్థితిని అనుసరించి అందుకుఁదగినట్లు వానినిమార్చుటకు వీలుకానందున మహాపాపులును అల్పదోషులును ఒక్కరీతిగనే వానినిబఠించుటచేతఁగూడ అవి మనస్సుమీఁదఁ బనిచేయవు.

15. ఇదియొకపనిగాఁబెట్టుకొని వేఱుపనులు లేనికాలమందు ఏకాంతముగ సమాహితచిత్తముతోఁగూర్చుండి, ఈశ్వరసహాయమునుగోరి దీర్ఘాలోచనచేసినఁగాని తాను మనోవాక్కాయములచేఁజేసిన అనేకవిధములైన పాపములును వానికారణములును స్పష్టముగ మనస్సునకు స్ఫురింపవు. నేను ఈస్థలమందు ఈకాలమందు ఈప్రాణికి ఈబాధను గలుగఁజేసితిని. దీనివలన ఈదోషముసంభవించినది, ఈసందర్భములో ఈకారణముచేత ఈదుష్కృతమును జేయుట సంభవించినది, అని కచ్చితముగ ఆయాదోషములును వానికారణములతో స్పష్టముగ హృద్గోచరమైనఁగాని వానినిగుఱించి మనస్సునకు నొప్పితగిలి నిజమైన పశ్చాత్తాపముకలుగుటయును ఇఁకముందు ఇట్టిదుష్కార్యములను జేయఁగూడదని మనస్సునకు దోఁచుటయును నిర్ధారణచేసికొనుటయును సంభవింపవు.

16. మనస్సుకరిఁగియున్న తరుణమందు ఈశ్వరసన్నిధానమును గల్పించుకొని తాను జేసిన పాపములను గంఠోక్తిగా

నొప్పుకొని అట్టిపాపములవలన ఈశ్వరుని ఆగ్రహమునకుఁ బా త్రులమై పరలోకమందు మనముపొందవలసిన దురవస్థను బా గుగనూహించిచూచినఁగాని నిజమైనపశ్చాత్తాపము కలుగనేర దు. సంతాపాగ్నియందు తప్తమైనమనస్సుతో క్షమచేయుమని ఈశ్వరుని అనేకవిధముల వేఁడుకొనినఁగాని ఈశ్వరకటాక్షము కలిగి ఆపాపములు నశింపవు.

17. చేసినదుష్కృతములనుగుఱించి పలుమాఱు లజ్జ ను అనుతాపమునుబొంది ఇఁకముందు ఇట్టిపాపములను జేయనని దృఢనిశ్చయము చేసికొని మనోవాక్కాయధర్మములను ఈశ్వ రార్పణచేసి భూతదయను సమభావమును అభ్యసించి పాపము లకుఁ బ్రతికూలమైన మనోధర్మములను గలుగఁజేయుమని ఈ శ్వరుని నిరంతరమును బ్రార్థించుచుండినఁగాని చిత్తశుద్ధియును బాపనివృత్తియును గలుగనేరవు.

18. వేమన్న చెప్పినలాగున చిత్తశుద్ధిలేని శివపూజలు న్ను, ఆత్మశుద్ధిలేని యాచారములును వ్యర్థములు. సమస్తవర్ణా శ్రమాది ధర్మములను భీష్ములు ధర్మరాజునకు సవిస్తరముగ నుపదేశించినపైని సర్వధర్మసారమేదియో దానిని సెలవిమ్మని ధర్మరాజుప్రశ్న చేసినట్లును అందుకుత్తరముగ "పరోపకార మువలన బుణ్యమును బరపీడనమువలనఁబాపమును గలుగును" అని భీష్ములు ఆనతిచ్చినట్లును జెప్పఁబడియున్నది. ఇది నిస్సం దేహము. ఏలయనఁగా దనబిడ్డలందఱును బరస్పరాను రాగ ముగలిగి ఒకరినొకరు ఏవిధముగను బాధింపక కూడినంతవఱకు

ఒకరికొకరు సహాయము చేయుచుండవలయునని తండ్రి సదా కోరుచుండును. ఇందుకు వ్యతిరేకముగ నడచుబిడ్డలయందు దండ్రి ఆగ్రహించి వారిమంచికొఱకే వారినిశిక్షించుచుండుటయును వారు ఎంత వేఁడినను ఎన్ని స్తోత్రములను జేసినను ఎన్ని వందనములను జేసినను దమయందు దమతండ్రికి గనికరముగలుగవలయునని ఎన్ని ఉపవాసాది కఠినతపస్సులను జేసినను దన బిడ్డలలో నితరులను బాధించుచునే ఉన్నంతవఱకు దండ్రి వారికి బ్రసన్నుఁడుగాక ఆదినమునకాదినము అధికదండనలనే చేయును అనుటయును అట్లు తమకంటె ఇతరులయినబిడ్డలను బాధించుటమాని అదివఱకు దాము తమసోదరులకుఁ గలుగఁజేసిన బాధలకు బశ్చాత్తాపమునునొంది ఈతప్పుక్షమింపుమని ఆర్తితో వేఁడుకొని ఇఁకముందు ఇట్టిఅపరాధమును జేయమని నిశ్చయముగ జెప్పినయెడల దండ్రి వారినేరమును క్షమించి వారినిగారవించుననుటయును నిత్యానుభవసిద్ధము. ఇట్టిస్థితిలో మనోవాక్కాయకర్మలలో దేనిచేతనైనను మనము ఇతరులను బాధించుచున్నంతవఱకు మనమెన్ని తీర్థయాత్రలుచేసినను దపోవ్రతనిష్ఠలనెన్నిఁటిని జేసినను ఎన్ని దానధర్మములను జేసినను ఎన్ని విధములస్తోత్రములను జేసినను ఎన్ని వందనములను జేసినను ఎంత వేఁడుకొన్నను దండ్రులకు దండ్రియును సర్వసముఁడును ధర్మస్వరూపుఁడును సర్వజ్ఞుఁడును అయిన సర్వేశ్వరుఁడు మనకుబ్రసన్నుఁడగునా? మనపాపములను క్షమించునా? మనకువరదుఁడగునా? ఒకబిడ్డనుదోఁచితెచ్చిన ధనమును మఱి

కొందఱుబిడ్డలకిచ్చుటవలనఁ దండ్రిసంతసించునా? వంచనవల నఁగాని చౌర్యమువలనఁగాని లంచముపుచ్చుకొనిగాని ఇతరుల నుబాధించి సంపాదించిన ధనములోఁగొంత భాగమునుగాని అంతనుసైతముగాని కర్చుపెట్టి సంతర్పణలను సమారాధనలను జేసినఁగాని దానధర్మములను జేసినఁగాని సర్వేశ్వరునకు లేశమైనఁ బ్రీతికరమగునా? అఖిలాండకోటి బ్రహ్మాండములను సృజించి పరిపాలించుచున్న నిత్యతృప్తుఁడు అన్యాయార్జితముల వలన సమకూర్పఁబడిన పంచభక్ష్యపరమాన్నములతోనైనను మనముచేసిన నివేదనను అంగీకరించునా? ఇవిఅన్నియు నిరయహేతువులే అవునుగాని ఈశ్వరప్రీతికరములు కావని ఏమాత్రము ఆలోచించినను స్పష్టముకాకమానదు. కావున ఏవిధముగనైన బుద్ధిపూర్వకముగఁబరపీడనముచేయుచున్నంతవఱకు ఎన్నితపోదానధర్మస్వాధ్యాయ జపహోమాదులను జేసినను ఈశ్వరకటాక్షముకలుగుటగాని పాపక్షయపాపనివృత్తులు అగుటగాని సంభవింపదు.

19. కాఁబట్టి దుష్ప్రవర్తనను నివర్తిచేసికొనుటయు ను సత్ప్రవర్తనను వృద్ధిచేసికొనుటయును స్నానసంధ్యా జప హోమాద్యనుష్ఠానములకును దపోవ్రతనిష్ఠలకును బునాది యును మూలబీజమును అయ్యున్నది. ఈపునాది దిట్టములేక నానావిధకర్మలనెడిపంజరము నిలువనేరదు. ఈమూలబీజము లేక ఏవ్రతములును ఫలింపవు.

20. దుష్ప్రవర్తనను అణచి సత్ప్రవర్తనను వృద్ధిచే

సికొనుట ఇహమందు మనస్థితిని బాగుచేసికొనుటకును ఆంగ్లే యులు జపానీయులు మొదలగువారితో సరియైన ఔన్నత్యము ను మనదేశీయులు పొందుటకునుగూడఁ బ్రధానమైయున్నది.

21. అనేక కారణములచేత (వానిని ఇచ్చటవివరించు ట అనావశ్యకము) ప్రకృతమందు మనలో సత్యవాక్యసంప న్నత మాటనిలుకడ ధారాళత్వము అప్రమత్తతయున్నగు సౌ శీల్యములు మొత్తముమీఁదఁ జాలలోపముగనున్నవనియు అ ప్రమాణము మాటతప్పుట కపటము బూటకము డాంబికము స్వప్రయోజనపరత్వము పరహింస పరనింద ఇత్యాదిదుష్ప్ర వర్తనలు చాలతగ్గవలసియున్నవనియు సామాన్యముగ నొప్పు కొనఁబడుచున్నదని నమ్ముచున్నాను. కావునఁ దాము సత్ప్ర వర్తనకలవారై యుండుటయేగాక సత్ప్రవర్తనను ఏవిధముగ నైన ఎంతస్వల్పముగనైన వృద్ధిచేయుటకు బ్రయత్నించుట సత్ప్రవర్తనకు జన్మస్థానమైయుండిన మనదేశమందభిమాన ముకలవారందఱకును విధాయకమైయున్నది.

22. మనసనాతనధర్మములు క్లుప్తముగ వేదమందుఁజె ప్పఁబడియున్నవి. వానినిగ్రహించుటకు సాధ్యము కాదని పరమ దయాళులైన మనఋషులు శ్రుత్యర్థములనువివరించి స్మృతుల నేర్పఱచిరి. అవియును సులభసాధ్యములుకానందున వానిని బురాణేతిహాసరూపమున దృష్టాంతపూర్వకముగవ్యక్తపఱచిరి. ఇటీవల సంస్కృతము దేశభాషగానుండనందున సంస్కృతభా షాజ్ఞానములేనివారు వానినిగ్రహింపలేరని తిక్కనాది ఆంధ్ర

కవులువానిని ఛందోబద్ధముగఁ దెనిఁగించిరి. అవియును గ్రంథ బాహుళ్యంబులును ఆంధ్రభాషాజ్ఞానమును బాగుగలేనివారికి అగ్రాహ్యంబులును అయినందున ద్విపదలుగను జ్యోర్ణికలుగ ను గొన్నిభాగములను గొందఱుమహానుభావులు రచించుచు న్నారు. కాఁగా మనము చేయుస్తోత్రములును బ్రార్థనలును మంత్రరూపముగనె యుండవలెను, సంస్కృతభాషలోనే యుం డవలెను, ఛందోబద్ధముల య్యేయుండవలెను, అనెడుఆక్షేపణ అంతసరికాదని వినయముతో మనవిచేయుచున్నాను. ఈశ్వరు నిజేరవలసినవి మనఅంతఃకరణవృత్తులుగాని వాక్కులుకావు. కావున దేశభాషయును స్వభాషయును అగు తెనుఁగుభాషలో వచనరూపముగ ఇందులోని ప్రార్థనాదులుండుట ఈగ్రంథవిష యమునకులోపముగ నెంచఁబడగూడదని మనవిచేయుచున్నాను

23. ఇదియునుగాక ఎవ్వరైనను దనప్రభువునెడలఁదా ను జేసిన మహాపరాధమును క్షమించి రక్షింపుమని ఆయనను వేఁడుకొనునపుడు పొరలిపొరలివచ్చుదుఃఖమువలన గలుగు గద్గదస్వరముతో మాటలు తడఁబడశబ్దసౌష్ఠవముచూచుకొనక తనఊహాలు ఏభాషలోఁబాడమునో ఆభాషలోను ఆమాటలతో ను సంతాపముతో మొఱలిడునుగాని రాగవరుసగను అన్యభాష లోను ఛందోబద్ధముగను బెద్దసమాసములతోను గానముచే యునా? అట్లుచేసిన అదినిజమైన పరితాపముకాదనియు అదికే వలనటనఅనియును బ్రభువుతలంపకుండునా? అందువలన బ్రభు చిత్తముకరఁగునా? ఐహికప్రభువునకుఁదనభాషాజ్ఞానములేనియె

డలఁ బ్రభువునొక్క భాషలో జెప్పుట చెప్పించుటయు సంభవిం పవచ్చును. సర్వహృదిస్థుఁడును సర్వసాక్షియును సర్వజ్ఞుఁడును అయిన సర్వేశ్వరునితోఁ దాను జేయు విజ్ఞాపన ఏభాషలోనుండి ననేమి? కావున మనస్తాపమును వ్యక్తపఱుచు ప్రార్థనాదులు స్వభాషలో సానూవ్యసరణిని ఉండుట సదుపాయమే గాక విధాయకమనియు విన్నవించుటకు సాహసించుచున్నాను.

24 ఈసంచికలోని విషయములలో అంతఃకరణవిచారణ ముఖ్యమైనది. అట్టివిచారణను ఓపికతో మనఃపూర్తిగ అప్పుడప్పుడు చేయుచున్నయెడల ఏదోషములను మనము తెలియక చేయుచున్నామో ఏపాపములు మనమనస్సును ఆకర్షించుచున్నవో ఎట్టిసందర్భములలో నేకారణములచేత ఏపాపములను జేయుచున్నామో ఇవిస్పష్టపడకమానవు. మూలమూలలను మఱుఁగుపడియుండు పాపములును ఇదిపాపమని యెఱివలలో మనకుఁ దోఁపనిదోషములును మనకువిశదములగును. అట్లుస్ఫురించిన పాపములను జేసినటులు ఈశ్వరసన్నిధానమందు ఒప్పుకొని అట్టిపాపములను జేసినందుకు నిజమైనపరితాపము నొంది క్షమింపుమని కరుణాసముద్రుని ఆర్తిలో వేఁడికొనిన ఈశ్వర కటాక్షముకలిగి పాపక్షయమగుననుటకు సందేహముండదు.

25. మఱియును ఇట్టిపాపస్వభావమునుగుఱించి నిజమైనలజ్జను అనుతాపమును దఱుచుగఁ బొందుటవలనను, ఇట్టిపాపములను మరలఁ జేయనని దృఢనిశ్చయముచేసికొని అట్టిపాపములకుఁ బ్రతికూలమైన అంతఃకరణధర్మముల నొసంగుమని

ఈశ్వరుని వేఁడుకొనుటవలనను, తనదిఅనఁబడు సర్వమును ఈశ్వరేచ్ఛానుసారముగ వినియోగపడునట్లు ఈశ్వరార్పణచేయుటవలనను, సమభావము నభ్యాసముఁజేయుటవలనను, ఒక్కమాఱుకాకపోయినను గ్రమక్రమముగఁ బరమేశ్వరానుగ్రహముకలిగి పాపములుతగ్గుచువచ్చి చిత్తశుద్ధికలుగవచ్చును. ఈఅంతఃకరణవిచారణను అప్పుడప్పుడు శ్రద్ధతోఁజదువుచుండినమాత్రమున అందులోవివరింపఁబడిన దోషములను మనముచేయఁగూడదని స్ఫురించుచుండి మనముచేయుపాపములు నానాటికితగ్గి మనప్రవర్తన బాగుపడనచ్చును.

26. ఏమతసిద్ధాంతముననుసరించువారికైనను సర్వజనసామాన్యధర్మములను బాటించుటయును మనుష్యాదులకు ఎట్టిబాధనైనను గలుగఁజేయు మనోవాక్కాయకర్మలను సాధ్యమైనంతవఱకు విడిచిపెట్టుటయును బ్రధానకార్యములైయున్నవి. ఆస్తికులకు ఈశ్వరభక్తివిధాయకమని ఒత్తిచెప్పనక్కఱలేదు.

27. పైహేతువులనుబట్టి సాధ్యమైనంతవఱకు వాడుకలోనుండు తెనుఁగుమాటలతో అంతఃకరణవిచారణయును జేసినపాపములకు బశ్చాత్తాపరూపప్రాయశ్చిత్తమును అట్టిపాపములను మరలఁజేయకుండుటకు దగినఉపాయరూపమైన ప్రార్థనలును ఈసంచికలో వ్రాయఁబడినవి. ఉమతభక్తిగ నేనుజేసిన ఈప్రయత్నములోనున్న దోషములను గణింపక గుణలేశములను అంగీకరించెదరని చదువరులను బ్రార్థించుచున్నాను.

---

ఓం పరమాత్మనేనమః.

# పాపక్షయపాపనివృత్తులు.

పాపక్షయమనగా ఇదివఱకుఁ జేయఁబడిన పాపములు ఈశ్వరుఁడు క్షమించుటవలన నశించుట. ఇందుకుఁదగిన ప్రాయశ్చిత్తమేమనఁగా, వీనినిగుఱించి యథార్థమైన తీవ్ర పరితాపమునుబొంది వీనినిక్షమింపుమని పరమదయాళుఁడైన ఈశ్వరుని, నిర్మలచిత్తముతోను, మనఃపూర్తిగను, ఆర్తితోను, వేఁడుకొనుటయె.

పాపనివృత్తి అనఁగా మనస్సును పాపచింతలనుండి మరలించి, మరలబుద్ధిపూర్వకముగఁ బాపములను జేయకుండుటయె. ఇది బహుదుర్లభావస్థ. చిరకాలాభ్యాసమువలనఁ గలిగినభక్తి వైరాగ్యములచే ఈశ్వరానుగ్రహమువలన లభించిన చిత్తశుద్ధివలనఁ బాపనివృత్తి ముఖ్యముగఁ గలుగును.

తాను జేసినపాపములనుగుఱించి చింతించి చింతించి లజ్జాక్రాంతహృదయుఁడై తన్నుదానె గర్హించుకొనుటయును; వానినిగుఱించి తీక్ష్ణసంతాపమునొందుటయును; వానిని మరలఁ జేయనని దృఢనిశ్చయమును జేసికొనుటయును; అర్పణయు

ను ; సమబుద్ధియును ; అంతశ్శుద్ధినిగలుగఁజేయఁదగిన చిత్తవృత్తులను బ్రసాదింపుమని సర్వేశ్వరుని నిరంతరమును వేఁడుకొనుటయును; పైనివివరించిన చిత్తశుద్ధికి సాధనములుగనున్నవి.

తాను జేసిన ప్రతిపాపమును దానిపూర్వోత్తరసందర్భములతోఁ దనకు స్పష్టముగ స్ఫురించినఁగాని ఆపాపములను గుఱించి తీక్ష్ణమైన పశ్చాత్తాపము కలుగనేరదు.

తనతలంపులను ఉద్దేశములను దానుఆడినమాటలను దానుజేసినకార్యములను నిష్పక్షపాతముగ దీర్ఘాలోచనచేసి విమర్శించినఁగాని తానుజేసినపాపములును వానివలన కరుణానిధియైన తండ్రియగు సర్వేశ్వరునియెడల దానుజేసిన మహాపరాధమును దనకుస్పష్టముగ స్ఫురింపవు.

కాఁబట్టి పాపక్షయపాపనివృత్తులనుగోరువానికి బైనివివరించినరీతిని దనమనోవాక్కాయకర్మలను మనసారఁబరిశీలనచేసికొనుట మొదటిపని అయ్యున్నది.

అటులుచరిగించనుద్దేశించిన పురుషుఁడుగాని స్త్రీగాని తనకు ఇతరవ్యాపకములు లేనిసమయమునుజూచుకొని రహస్యస్థలమందు ఒంటరిగఁగూర్చుండి తానుఁజేయఁబూనిన ఈవిమర్శకు సహాయభూతుఁడవుకమ్మని ముందుగా ఈశ్వరుని బ్రార్థించి తన మనస్సును హెచ్చరికచేసికొని తానుజేసినపాపములను జ్ఞప్తికిఁదెచ్చుకొనుటకు ఆరంభింపవలయును.

అట్టిప్రార్థనయును హెచ్చరికయును ఈక్రిందిమాదిరిగనుండవచ్చును.

---

## ప్రార్థన.

ఓపరమేశ్వరా! బహువినయముతో నేనుజేయు మనవిని దయార్ద్రహృదయముతో ఆకర్ణింపుము.

దేవా! ఇపుడునాహృదయమును బరిశోధనచేయఁబూనుకొన్నాను; గాని అయ్యో! నామనస్సు మిగులమోసకారియును మాయావియును అయ్యున్నందున దానిని నేనై తెలిసికొనుట దుర్లభము.

కాఁబట్టి సర్వాంతర్యామివై హృదయధర్మములను గుర్తెఱింగి వానిని శిక్షింపసమర్థుడవైన ఓసర్వజ్ఞుఁడా? నాహృదయమందు మాటువడియున్న సమస్తదోషములను మోసపుఁదలంపులను గరుణించి నాకుస్పష్టపఱుపుము. అట్లుకటాక్షించినచో నాకుగోచరములైన సర్వపాపములను నేనుబుద్ధిమాలిచేసితినని నీదివ్యసమ్ముఖమున ఒప్పుకొని, అయ్యో! ఇట్టిపాపములను ఏలచేసితినని పశ్చాత్తాపదవానలమందు పరితపించి వానిని క్షమింపుమని ప్రపన్నైకబంధుఁడవైన నిన్నుఁద్రికరణశుద్ధిగ వేఁడికొని పరమకారుణికోత్తముఁడవైన నీకృపకు బాత్రుఁడనగుదును.

ఓం, తత్, సత్.

## హెచ్చరిక.

ఓ పాపిష్టిజీవుఁడా! సర్వగతుఁడై సర్వసాక్షియగు సర్వేశ్వరుని దివ్యసన్నిధానమున నీపుణ్యావిశేషముచే నీవిపుడు నిలిచియున్నావు.

నీటిబుగ్గవలె క్షణభంగురమైన ఈకళేబరమునుండి భయంకరులైన కాలదూతలవల్ల నీవు పైకీడ్వఁబడి ఎల్లలోకములలోని ప్రాణులపుణ్యపాపములను బరిశీలించి దండనాదులను విధించు న్యాయాధిపతులకును న్యాయాధిపతియైన అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని పాపులకుభయంకరమైన దివ్యసభయందు నీవు నిలువఁబెట్టఁబడి నీవుచేసిన సమస్తదుష్కర్మలు, నీవు ఆడినదుర్వాక్యములు, నీవుతలంచిన దుశ్చింతలు ఇత్యాది పాపములనుగుఱించి నీమనస్సాక్షియే నీపై అభియోక్తగనిలిచి నీమీఁద నేరములనుమోపినప్పుడు అనన్యశరణ్యుఁడవైయున్న నీదురవస్థ ఎంతఘోరభయానకమైయుండునో కొంచెము ఆలోచించిచూచినయెడల నీగుండె నీరై పోవకయుండునా!

నీవుచేసినపాతకములను స్మరించి సంతప్తుఁడవై «వీనిని బుద్ధిహీనుఁడనై చేసితిని ఓకరుణాసముద్రుఁడా! వీనినిక్షమించి నన్నురక్షింపుము» అని మొఱపెట్టుకొనుటకుఁ బరమదయాళుఁడైన ఈశ్వరుఁడు నీకు ఇప్పుడుకలుగఁజేసిన అవకాశము ప్రపంచమునంతను ధారపోసినను నీకప్పుడు కలుగనేరదుగదా.

కాఁబట్టి, ఓజీవుఁడా! పరలోకమందు నీకుఁదటస్థమయ్యె

డిదుఃఖసముద్రమును నీవుదాఁటవలెనన్న ఇప్పుడే నీదోషము లనునీవే యథార్థముగ నిర్ధారణచేసికొని ఆకరుణానిధిని క్షమింపవేఁడుకొని శరణాగతత్రాణుని గటాక్షమునుబడసి కాలాగ్ని సదృశమైన దండధరుని కోపాగ్నిజ్వాలలనుండి తప్పించుకొనుము,



అంతఃకరణవిచారణ.



ఓజీవుఁడా ! నీహృదయగ్రంథులయందు మఱుఁగుపడి యున్న నీగుట్టులనన్నిటిని గుర్తెఱిఁగియున్న సర్వసాక్షియైన సర్వేశ్వరునియెదుట నీవునిలిచియున్నట్లు భావించుకొని ఈక్రింద వివరింపఁబడిన ప్రశ్నలకు యథార్థమైన ఉత్తరములను బ్రమాణముగాఁ జెప్పుము.

నీస్వభావమంతయు దుష్టమైనదేయనియు మంచినివదలి చెడుగునందే ప్రవర్తించునదియనియు నీకునిత్యానుభవదృష్టమైయుండలేదా ?

బాల్యమునుండి నేటివఱకును నీకాలమును ఎంతవ్యర్థపఱచితివో నీకువిధ్యుక్తములైన సత్కర్మలను ఎన్నిటిని జేయలేదో నీవుచేయరాని దుష్కర్మలను ఎన్నిటిని జేసితివో విచారించిచూడుము.

అందులోఁ గేవలముగ ఈశ్వరునియెడల ఎట్టిఅపరాధములను జేసితివి ?

నాస్తిక్యము, ఆస్తిక్యమునుసంశయించుట, దేవహేళనము, ఈశ్వరునికరుణారసత్వమునుగుఱించి అపనమ్మకపడుట, ఈశ్వరకటాక్షముగలదని గర్వించుట, ఈశ్వరానుగ్రహముకలుగదని నిరాశనొందుట, ఇట్టిఅపరాధములనేమైన జేసితివా? ఈశ్వరతత్వజిజ్ఞాసయందు బుద్ధిపూర్వకముగ ఉపేక్ష చేసితివా?

నిత్యకృత్యమైన ఈశ్వరారాధనను జేయమఱచితివా? రాజసముచేమానితివా?

ఈశ్వరారాధనయందు పరధ్యానముగనుండుట; భక్తిలేకయుండుట; భక్తికలవానివలె నటించుట; విసుకుదలనొందుట; భూతప్రేతాదిగణములనుపాసించుట; ఇట్టిదోషములనేమైన జేసితివా?

నీకు ఏప్రాణియైనను ఏపదార్థమైనను ఈశ్వరునికంటె అధికప్రేమాస్పదమైయుండెనా? మనుష్యులకోపప్రసాదములను ఈశ్వరునికోపప్రసాదములకంటె అధికముగ గణించితివా?

ఈశ్వరసంకల్పమునకు మూలుగుకొనుట; ఈశ్వరవిలాసానుసారముగ సంభవించిన యాపదలకుఁ దాళఁజాలకయుండుట, ఆత్మహత్యకుఁబ్రయత్నించుట, ఈశ్వరకటాక్షమువలనగలిగిన మేలునకు కృతజ్ఞతలేకయుండుట, ఈశ్వరాజ్ఞలనుల్లంఘించుట, దైవదండనవలన బుద్ధితెచ్చుకొనకయుండుట, ఇట్టిపాపములనేమైనఁజేసితివా?

ఈశ్వరనిందాస్పదములైన తలంపులనుగలిగియుండుట, అట్టిసంభాషణచేయుట, ఈశ్వరదూషణనువిని ఉపేక్షాభావము

గనుండుట, మాటిమాటికిని ఒట్టుపెట్టుకొనుట, అప్రమాణము చేయుట, చేసినమొక్కులను జెల్లింపకపోవుట, దేవస్వధర్మస్వాపహారముచేయుట, దేవస్థానములయందు అదవులేకసంచరించుట, భగవద్వాక్యములు పఠింపఁబడినప్పుడుగాని, ఈశ్వరగుణకథనము చేయఁబడినప్పుడుగాని, అలక్ష్యభావముగనుండుట; ఇట్టిఅపరాధములను నీవుచేసితివా?

పాపమునకు వెఱవకయుండుట, పాపముచేసితినన్న చింతయే లేకయుండుట, చేసినపాపములనుగుఱించి పశ్చాత్తాపము లేకయుండుట, ప్రాయశ్చిత్తము చేసికొనుటకు రేపుమాపని కాలయాపనచేయుట, బూటకముగఁ బశ్చాత్తాపపడి మరలయథాప్రకారము పాపములను జేయుచుండుట, ఇదికూడదని అంతరాత్మ చేసిన హితబోధను నిర్లక్ష్యపెట్టుట, ఇట్టిఅపరాధములను జేసితివా?

అన్యమతదూషణ, అన్యమతదేవతాతిరస్కారము, అన్యమతస్థులయందు అసూయకలిగియుండుట, ఇట్టిపాపములనేమైనచేసితివా?

ఓజీవుఁడా! నీవుస్వవిషయములో ఎట్టిపాపములను జేసితివి?

సద్వంశసంభూతుఁడవనిగాని; ధనవంతుఁడవనిగాని; విలువగల వస్త్రాద్యలంకారములను జూచుకొనిగాని; అధికారము మాటచెల్లుబడి కలదనిగాని; శక్తియుక్తులుకలవనిగాని; జ్ఞానివి యోగివి ఆహితాగ్నివి నిష్ఠాపరుఁడవు పుణ్యశాలివిఅనిగాని; గర్వపడితివా?

ఆత్మస్తుతిని జేసికొనుట; చేసినధర్మమును జెప్పికొనుట; స్తోత్రప్రియుఁడవైయుండుట; ఇతరులచే మెప్పుపొందుటకో పేరుపొందుటకో మొగమాటముచేతనో దానధర్మములను జేయుట; ఇతరులు ఏమనుకొందురో యనుభీతిచేతఁ జేయఁగూడదని మనస్సాక్షి సుస్పష్టముగ సూచించుచున్న పనులను జేయుట; స్వప్రయోజనపరుఁడవైయుండుట; నీయాశ్రమధర్మమును శక్తికొలఁది జరుపకయుండుట; నెఱవేర్చుటకుఁ దగిన శక్తియుక్తులుగాని తీరుబడిగాని ఓపికగాని లేక యేవిధాయకములుగాని ఉద్యోగములను బనులను మీఁదవేసికొనుట; కోరిమీఁదవేసికొన్న ఉద్యోగధర్మములను శక్తికొలఁది శ్రద్ధాభక్తులతో నెఱవేర్పకపోవుట; ఇట్టిపాపములను జేసితివా?

ధనాకర్షణ, ఇంద్రియసుఖానుభవము, వీనియందు మితిమీఱిన వాంఛకలిగియుంటివా? అతిదీర్ఘమైనఁగాని తీక్ష్ణమైనఁగాని కోపావేశముకలిగియుండుట; చిరచిరలాగుచుండుట; అతిచాపల్యముగలిగియుండుట; ధారాళత్వములేకయుండుట; నీశక్తియుక్తులకుఁదగినస్థితిలో అసంతుష్టుఁడవైయుండుట; నీ శక్తియుక్తులకుఁ దగినస్థితి లేనిచో, అందుకుఁదగినపాటుపడి వలయుప్రయత్నములను జేయుటమాని దైవమునుదూఱుచుండుట; ఇత్యాదిదుర్గుణములను గలిగియుంటివా?

కాలమును అనావశ్యకవిషయములయందు వ్యర్థపఱచుట; మనోవికారహేతువులను బ్రతిఘటించుటయందు ఉపేక్షగానుండుట; జ్ఞానభక్తివైరాగ్యములను వృద్ధిచేసికొనుటకు

ఈశ్వరానుగ్రహమువలనఁ గలిగినఅవకాశములను వ్యర్థపఱచుట; ప్రజ్ఞావిశేషములను దుర్వ్యాపారములయందు వినియోగించుట; ఇత్యాదిదోషములకు లోనైతివా?

ఆహారనిద్రాదులయందును వేఁట ఆట మొదలగు విహారములయందును మితిమీఱిప్రవర్తించుట; వానియందు అత్యభిలాషకలిగియుండుట; ద్యూతమాడుట; మద్యపానముచేయుట; నిషిద్ధపదార్థసేవనము; తులువతనము; వాక్పారుష్యము; పరాశ్రయజీవనము; దృఢగాత్రుఁడవైయుండియు యాచనవృత్తినవలంబించుట; చీటిమాటికి యాచించుట; ఇట్టిపాపములను జేసితివా?

చూడరాని అంటరానిపదార్థములనుఁ జూచుట అంటుట; అట్టివానియందు మక్కువపడుట; చనరానిచోట్లకుఁజనుట; చేయఁగూడనిపనులను జేయుట; కామాతురతకలిగియుండుట; (1) పరస్త్రీలను దుర్బుద్ధితోఁజూచుట; కామించుట; వారలతో వ్యభిచరించుట; జారులతోసహవాసముచేయుట; కామోద్రేకములైన ఆటలు, పాటలు, మాటలు, కథలు, చేష్టలు, చిత్తరువులు, వీనియందు ఆసక్తిగలిగియుండుట; ఇట్టి పాతకముల నేమైనఁజేసితివా?

ఓజీవుఁడా! ఇతరులవిషయమై నీవు ఎట్టిఅపచారములను జేసితివి?

---

(1) విచారణచేయువ్యక్తి స్త్రీ అయినయెడల "పరస్త్రీలను" అనుమాటకుబదులు "పరపురుషులను" అని మార్చవలెను.

రాజవిశ్వాసమునకు విరుద్ధమైనఆలోచనలు, సంభాషణలు, కార్యములు, చేసితివా?

రాజకీయఅధికారులను, నీయజమానులను ధిక్కరించుట, శాస్త్రవిరుద్ధములుకాని వారియాజ్ఞలను ఉల్లంఘించుట, నిర్లక్ష్యపెట్టుట; ఇట్టిఅపరాధములను జేసితివా?

అధికారికృతముగ నీకార్యములను నెఱవేర్చుకొనుటకుఁగాని నీకుసంభవించిన అన్యాయమును జక్కపఱచుకొనుటకుఁగాని, పద్ధతులకును నీతికిని వ్యతిరిక్తమైనమార్గములను ఉపాయములను అవలంబించితివా?

నీకుఁగల అధికారమును నెఱవేర్చుటలో లంచముపుచ్చుకొనుట, తత్సమానమైన ఇతరలాభమునుబొందుట; లంచపంచములకు ఆసించిగాని, మొగమోటముచేతఁగాని, భీతిప్రీతులవలనఁగాని, పక్షపాతముచేయుట; ఏకారణముచేతనైనను బుద్ధిపూర్వకముగఁగాని అశ్రద్ధచేతఁగాని అన్యాయముచేయుట; ఇత్యాదిపాతకములకు ఒడికట్టుకొంటివా?

ఎవరివిషయమై ఎప్పుడు బుద్ధిపూర్వకముగఁ దప్పుఅభియోగముచేయుట, తప్పుసాక్ష్యముచెప్పుట, తప్పుసృష్టిచేయుట, వానిని నిజమైనవానిగ నుపయోగపర్చుట; బుద్ధిపూర్వకముగ దప్పు అభిప్రాయమిచ్చుట, వాగ్దానముతప్పుట, అబద్ధమాడుట; మోసముచేయుతలంపుతో ద్వంద్వార్థముగనో సూచనగనో పలుకుట, మోసము మొదలగునటనచే అసత్యమును గ్రహింపచేయుట; ఇత్యాది దుష్కృతములను జేసితివా?

ఎవరికి ఎప్పుడు నరహత్య, శిశుహత్య, భ్రూణహత్య, ఘాత, చెఱుపు, ఇత్యాదిహింసలను జేసితివా? శాపము పెట్టుట, తిట్టుట, ఇట్టివాక్కులచేతఁగాని తలంపులచేతఁగాని కీడునుకోరితివా? ఏవిధముగనైన మోసము, విశ్వాసఘాతము, స్తేయము, కపటవర్తనము, ఇత్యాదిపాపకృత్యములను జేసితివా?

ఎప్పుడు (2) ఏస్త్రీని చెఱపట్టుట, మానభంగముచేయుట, మరియేవిధముగనైన సిగ్గుచెఱుచుట; పరిహాసములు, భాషణములు, చూపులు, చేష్టలులోనగువానిచేతఁగాని; ఉపహారములనిచ్చిగాని; ఇతరమాయోపాయములచేతఁగాని వలపుపుట్టించి చెఱుచుట; కుటుంబముతో ఎడఁబాపుచేయుట, ఇత్యాదిపాతకములను జేసితివా?

కన్యాశుల్కము, వరశుల్కము, పుచ్చుకొనుట; స్వలాభమును, వేడుకను ప్రధానముగనెంచి కన్యకయొక్కగాని పురుషునియొక్కగాని క్షేమమునకు విరుద్ధముగ వివాహముచేయుట; నీసంరక్షణలోనున్న పుత్రపుత్రికాదులకు నీశక్తికొలఁదిని హితబోధచేసి దైవభక్తిని నీతిని గఱపకయుండుట; ఇట్టి దోషములనుజేసితివా?

ఎప్పుడు ఎవరివిషయమై దుర్భాషలాడుట; లాఘవపఱచుట; అపకీర్తినిగలుగఁజేయు మిథ్యారోపణములనుచేయుట; పరాభవపఱచుట; హేళనచేయుట; కొండెములనుజెప్పు

---

(2) విచారణచేసికొనువ్యక్తి స్త్రీ అయినయెడల ఈభాగమును వదలివేయవలెను.

టు; అనావశ్యకముగ దోషములను వెల్లడిచేయుట; చాడీలు చెప్పి కలహామునుపుట్టించుట, వృద్ధిచేయుట; ఎదుటముఖస్తుతి చేయుట; పరోక్షముననిందచేయుట; ఆక్షేపించుట; తృణీకరించుట; అశక్తి, రోగము, అంగవైకల్యము, కురూపము, ఇత్యాది దైవకృతములనుగుఱించిగాని మతవిషయమునుగుఱించిగాని అపహాసించుట, ఇత్యాదిదోషములను జేసితివా?

ఎప్పుడు ఎవరియెడల చీటికిమాటికిని జగడమాడుట, వివాదకుదిగుట; ఈర్ష్య, అసూయ, ఓర్వలేమికలిగియుండుట; పగసాధించుట; నిర్హేతుకముగ దుఃఖపెట్టుటయందు వేడుకగలిగియుండుట; ఇత్యాదిదోషములను జేసితివా?

నీకు ఉపకారముచేసినవారియెడలను మంచిఉద్దేశముతో నీతప్పునుగనపఱచి మందలించినవారియెడలను, కృతజ్ఞత లేకయుండుట; బీదలయెడలను ఆపదలోనున్నవారియెడలను జాలి, కనికరము, ధర్మశీలతయును లేకయుండుట; బంధుజనులయెడల బంధుసరణితప్పి సంచరించుట; తల్లిదండ్రులు గురువులుమొదలగు పితృసమానులు, పెద్దలు, యజమానులు, ఇట్టిపూజ్యులయెడల భయభక్తి విశ్వాసములు లేకయుండుట; న్యాయమైనవారి ఆజ్ఞలను మన్నింపకుండుట; స్వప్రయోజనమునకై సాధ్వియైన (3) ధర్మపత్నిని విడనాడుట, నిరాకరించు

---

(3) విచారణచేసికొనువ్యక్తి స్త్రీ అయినయెడల "సాధ్వియైన ధర్మపత్ని" అనుమాటకుబదులు "పతిని" అనియును, "ఆమెను" అనుమాటకుబదులు "ఆయనను" అనియును మార్చవలెను.

ట; విధాయకముగ పోషింపవలసిన మాతాపితృలను దారపుత్రాదులను శక్తికొలఁది పోషింపక ఉపేక్షించుట ; సేవకపరతంత్రులైన కోడండ్రు, భృత్యులు మొదలగువారిని ప్రేమతో నాదరింపకయుండుట, పరాభవపఱచుట, తప్పులు వెతకుచుండుట; లేనితప్పుఘటించి బాధించుట; చాడీలుజెప్పి దండింపఁజేయుట, దైవగతిచే భర్తృవిహీనలై యింటచేరినవితంతువులను కనికరముతోఁజూడక పాపిష్ఠురాండ్రని పరిభవించుట; బానిసలవలె చూచికష్టపెట్టుట ; ఇత్యాదిఅపచారములను జేసితివా ?

ఓజీవుఁడా ! నోరులేని జంతుజాలములయెడల నీవు ఎట్టి పాతకములనైనఁ జేసితివా ?

కేవలవిలాసార్థమై వన్యమృగములను పక్షులు మొదలగువానిని బట్టితెచ్చి వానికి స్వేచ్ఛావిహారము లేకుండునటులు నిర్బంధించితివా ? వినోదముకొఱకు వానినిహింసించుట; అంగవిహీనములచేయుట ; చిత్రవధచేయుట ; ఇట్టికౄరకృత్యములను జేసితివా ?

నీయుపయోగముకొఱకు ఉంచఁబడినగోవులు, అశ్వములుమొదలగు గృహజంతువులకు చాలినంతతగిన ఆహారమును పెట్టకపోవుట, అవిసుఖముగ వసించుటకుఁ దగిననిలయములను ఏర్పఱుపకపోవుట, వానిశక్తికి మించినబరువును మోయించుట పనిచేయించుట వానియెడల కౄరముగఁ బ్రవర్తించుట ; అవి వ్యాధివలనఁగాని ముసలితనమువలనగాని పనికిరానప్పుడు వానిని నిరాదరణచేయుట ; కసాయివానిపాలుచేయుట ; ఇత్యాది పాపములను చేసితివా ? భూతదయావిహీనుఁడవై యుంటివా ?

చూచీచూడనట్లు ఉపేక్షభావముగనుండుట, ప్రోత్సాహపఱచుట, ఆజ్ఞాపించుట, సహాయముచేయుట; ఇట్టివిధములుగ ఇతరులను పాపకృత్యములనుచేయునటుల ప్రేరేపించి నీపాపమును శతగుణముగ హెచ్చుచేసికొంటివా ?

వివరణము:—ఇట్లు నీవుచేసికొనిన ప్రశ్నలలో దేనికైనను నీమనస్సాక్షి «ఔను» అనియుత్తరమిచ్చినపుడు «కరుణానిధీ, నన్నుకరుణింపుము, దీనమందారా, ఈఅపరాధమును క్షమింపుము» అనివచించి ఆదోషములను పట్టీలోవ్రాయుము. ఇట్లు అన్నిప్రశ్నలకును ఉత్తరములుపూర్తిఅగువఱకును చేయుము. పిమ్మట ఆపాపములనుగుఱించి ముందువివరింపబడు రీతిని నీపశ్చాత్తాపమును వ్యక్తపఱుపుము.

ఎవరికైన అన్యాయమును గాని నష్టమును గాని కీడునుగాని చేసినట్లు ఈపరిశీలనలో నీకు వ్యక్తపడినయెడల అవకాశము చిక్కినతోడనే అందుకుఁదగినట్లు వారికి పరిహారమిచ్చి వారిక్షమను గోరుకొనుము.

నీవిషయమై ఎవరైన అట్టిఅక్రమములను జేసిరేని వారిని అందునుగుఱించి క్షమింపుము.

పాపకార్యములను జేయునటుల ఎవరినైన నీవు ప్రేరణచేసినట్లు కనఁబడినయెడల నిన్నును వారినికూడ క్షమింపుమని ఈశ్వరుని వేఁడుకొని అవకాశముకలిగినచో వారును అందునుగుఱించి అనుతాపమునుబొందునటుల వారికిబోధింపుము.

## అంతఃకరణవిచారణానంతరము చేయవలయుప్రార్థన.

మహాప్రభూ! నీకటాక్షమువలన నాదుశ్శీలమును పరిశీలించి కనుఁగొంటిని. హృదయధర్మములగు రోఁగి వానిని చక్కపఱుపఁగల సర్వశక్తుఁడా! నాపాపములకు కొంతవఱకైనఁ దగినప్రాయశ్చిత్తముగ నాహృదయమును సంతాపాగ్నియందు కరఁగించి పరిశుద్ధపఱుపుము.

దీనమందారా! నాతప్పులనుక్షమించి నాహృదయమందు నీవుచేయనుపక్రమించిన చిత్తశుద్ధియను పనిని సఫాకల్యముచేయుము.

వివరణము:—ఇట్లుప్రార్థించి నిర్జనప్రదేశమందు సావధానమనస్కుఁడవై కూర్చుండి, నీమనస్సును ఈశ్వరునిపాదకమలములయందు లగ్నముచేసి నీవువ్రాసినపాపములపట్టీని చేతనుంచుకొని ఈక్రిందవ్రాయురీతిని అపరాధక్షమాస్తోత్రమును జేయుము.

## అపరాధక్షమాస్తోత్రము.

సత్వగుణప్రధానులై పాపరహితులైన విబుధులును, అష్టాంగయోగసిద్ధులైన మహాయోగులును, ఏమహామహుని దివ్యసన్నిధియందు సాష్టాంగదండప్రణామముల నాచరించి ధా

లమున కేలుగీలించినిలిచి «రక్షరక్ష» యనిప్రార్థించెదరో, అట్టి శిష్టరక్షణయును దుష్టశిక్షయునుజేసి అఖిలాండకోటి బ్రహ్మాండములను పరిపాలించు ఓపరమేశ్వరా! పాంశుపరాగముకంటెను నికృష్టుఁడనై దిక్కుమాలిన మహాపాతకుఁడనైన నేను నీదివ్యసన్నిధానమున నెటులు నిలువనాహసింతును.

పరమశుచిర్మైన పావకునికి పావనత్వమును గలుగఁజేయు పరమపావనమూర్తి! పాపి నీదృక్పథమున ఎట్లుపడఁగలఁడు?

పాపాత్ములచర్యలును, వారలుచేయుఅర్చనలును నీకుగర్హితములుగాక ఎట్లుప్రియములగును.

బుద్ధిపూర్వకముగ మహాపాతకములనుజేసియున్న నేను ఘోరనరకాగ్నిలో దగ్ధుఁడనై దుఃఖసముద్రమందు అడుగంటవలసినవాఁడనే అయినను కరుణాకరుఁడవైన ఓదేవా! నీనిర్హేతుక జాయమానకటాక్షము శరణాగతుఁడనైన నాకు అడ్డుపడి నిన్ను నాకుప్రసన్నాభిముఖునిఁజేసి నామొఱను సదయహృదయముతో నాలింపఁజేయుఁగాక.

నేనెంత పరమపాపిష్ఠుడను! పాపస్వరూపుఁడనై మాతృగర్భమునుప్రవేశించి, పాపములోపొరలి, పాపముతోజన్మించి పాపమునేచేయుచున్న మహాపాతకుఁడనైన నేను కేవలస్వశక్తిచే పరిశుద్ధుఁడనుగానుండుటకు ఎట్లుసాధ్యమగును! మాతృగర్భసంభూతుఁడనైన నేనెక్కడ; పరిశుద్ధాత్ముఁడుగ నుండుటెక్కడ!

పరమపవిత్రులుగా గణింపఁబడు అగ్నివాయుసూర్యా లుసహితము నీదృష్టిచేతఁ గేవలపరిశుద్ధులుగ నెంచఁబడరు. సత్వగుణప్రధానులైన విబుధులుకూడ నీసమ్ముఖమున నిర్దో షులమనఁజాలరు. జ్ఞానులుగానెంచఁబగు మహర్షులుపహితము నీమాయాతీతులమనఁజాలరు. ఇట్టిచో అహోరాత్రములు ఉదకపానము చేయునటులు పాపమునుగ్రహించుచున్న నేను నీకెంత అసహ్యముగనుండవలెను.

అయినను నీవు నిఖిలహేయప్రత్యనీక అనంతకళ్యాణ గుణపరిపూర్ణుఁడవు, పతితపావనమూర్తివి, కరుణారసభరితుఁడ వు; గాన ఓదేవా! నన్ను నీకరుణార్ద్రదృష్టితోఁజూచి, నాపా పములనుక్షమించి, పరిశుద్ధునిగఁజేసి రక్షింపుము. రక్షింపుము.

నమస్తే నమస్తే నమః ఓం.

ఓతండ్రీ! నాయంతరంగము దుష్టమైనది. సత్కర్మను జేయవలెననిన దుష్కర్మము మీఁదికేపరుగిడును. కామక్రో ధాదులు నాయంతర్యాణితో సతతము బోరాడుచు మట్టుకొ నివచ్చుచున్నవి. ఓశరణాగతత్రాణా! ఈదుష్టశత్రులకీటడఁ గించి నాహృదయమును బరిశుద్ధపఱచి నన్నుపాపసముద్రము నుండి తరింపఁజేయుము.

అయ్యో! నాస్వభావము బహుధూర్తమయినదై, చె డుగునకుఁ జేయిచాచుచు మంచికి వెనుకడుగుఇడుచున్నది. నా తెలివి అజ్ఞానావృతమైయున్నది. నాచిత్తముకుటిలస్వభావము గలది. నామనస్సు అతిచంచలమైనది. నాధారణశక్తి అప

విత్రిమైన యంశములనే సద్బాజ్ఞ ప్తికిఁదెచ్చుచు విధాయకకృత్య ములను మఱుపుపుట్టించునది. కామక్రోధాది నామనోవికార ములు మితిమీఱినవి. నాజ్ఞానేంద్రియములు కల్మషములను లోనికి నాకర్షించుటకుఁ దెఱచియుండు ద్వారములైయున్నవి. నాశక్తియుక్తులు దుర్విషయములయందు వినియోగపడుచు న్నవి. ఏవిధమునజూచినను నేను అపవిత్రుఁడనే. అయినను ఓపతితపావనమూర్తీ! నీనిర్హేతుకకటాక్షముచే నన్నుగనికరిం చి నాతప్పులనుక్షమించి నన్నుబరిశుద్ధునిఁజేసి రక్షింపుము. ర క్షింపుము. నమస్తే నమస్తే నమః ఓం.

ఓభగవంతుఁడా! ఈదుష్టప్రాపంచిక మిథ్యాగౌరవము కొఱకు అత్యాశతో యత్నించుచు మాయాప్రేరితములకు సులభముగలోనగుచు విషయేంద్రియ సంయోగజనిత మిథ్యా సుఖానుభవాసక్తుఁడనగుచు భక్తిభావనలేని నిష్ప్రయోజన ములైన భేషజకర్మలనుజేయుచు నీయాజ్ఞలనుమీఱి నాజీవిత కాలమును వ్యర్థపఱచితిని. ఇట్టిపరమపాపినిఅయిన నేను నిర్హే తుకకటాక్షముచే నీవుక్షమించిననేగాక, ఓతండ్రీయని నీపాదా రవిందములయందు నెట్లుచేరఁగలను?

దీనవత్సలా! నీయెడల ఈక్రిందవివరించిన అపచారము లను బుద్ధిహీనుఁడనై చేసితిని

(ఇక్కడపట్టీనిజూచి ఈశ్వరునియెడల నీవుచేసినఅపరా ధములను వానివిశేషములతో నీవుబప్పుకొనుము.)

పరమేశ్వరా! నామనస్సాక్షియొక్క హితోపదేశము

లను లక్ష్యపెట్టక ఇట్టిపాతకములను దఱచుగాఁ జేసితిని.

కరుణాసింధూ! నన్ను నీకరుణార్ద్రదృష్టితోఁజూచి ఈ యపరాధములనుక్షమించి నన్నుబరిశుద్ధుని జేసి రక్షింపుము. రక్షింపుము. నమస్తే నమస్తే నమః ఓం.

జగదీశా! ఈక్రిందవివరించిన స్వవిషయమైన దోష ములను బుద్ధిహీనుఁడనై చేసితిని.

(ఇక్కడ పట్టీనిజూచి నీస్వవిషయములో నీవుచేసినపాపము లను వానివిశేషములతో ఈశ్వరునియెదుట ఒప్పుకొనుము.)

పాపభంజనా! నామనస్సాక్షి యొక్కహితోపదేశము లను నిరాకరించి ఇట్టిదోషములను దఱచుగాఁ జేసితిని.

కరుణానిధీ! నన్ను నీకరుణార్ద్రదృష్టితోఁజూచి ఈఅప రాధములనుక్షమించి నన్ను బావనుని జేసి రక్షింపుము. రక్షిం పుము. నమస్తే నమస్తే నమః ఓం.

లోకావనా! పరులయెడల ఈక్రిందవివరించిన పాపము లను బుద్ధిహీనుఁడనై చేసితిని.

(ఇక్కడ పట్టీనిజూచి పరులయెడల నీవుచేసినద్రోహము లను వానివిశేషములతో ఈశ్వరునియెదుట ఒప్పికొనుము.)

పాపనాశనా! నామనస్సాక్షి యొక్కహితోపదేశము లను నిర్లక్ష్యపెట్టి ఇట్టిదోషములను బలుమాఱు చేసితిని.

దయానిధీ! దయార్ద్రహృదయుఁడవై నాపాపములను క్షమించి నన్ను బావనుని జేసి రక్షింపుము. రక్షింపుము. నమస్తే నమస్తే నమః ఓం.

అనాథరక్షకా! నోరులేనిజంతుజాలములయెడల ఈ క్రిందవివరించిన పాపములను బుద్ధిహీనుఁడనై చేసితిని.

(ఇక్కడ పట్టీనిజూచి నోరులేనిజంతువులయెడల నీవుచేసినపాపములను వానివిశేషములతో ఈశ్వరునియెదుట ఒప్పికొనుము.)

పాపహరా! నామనస్సాక్షి యొక్కహితోపదేశముల ను నిర్లక్ష్యపెట్టి ఇట్టిదోషములను దఱచుగాఁజేసితిని.

కృపామయా! కృపారసదృష్టితో నన్నుజూచి నాపాపములను క్షమించి నన్నుబావనునిజేసి రక్షింపుము. రక్షింపుము, నమస్తే నమస్తే నమః ఓం.

మహాదేవా! నాదుష్కృతములు అసంఖ్యాతములు. నాశిరోజములనైనను గణింపవచ్చునుగాని నాపాతకవ్రజమును లెక్కింపశక్యముకాదు. అయినను నీకృపావిశేషములు నాపాతకములకంటెను అగణ్యములు. దీనావనా! నీకరుణావిశేషములను జాటించి నన్నుగనికరింపుము; నాపాపరాశిని రూపుమాపి నీపతితపావనత్వమును బ్రకటింపుము.

అయ్యో! ప్రతినిమిషమును నేను అపరాధములను జేయుచునేయున్నాను. నాకుద్యోతకములుగాని తప్పులును నాకుస్ఫురింపనిపాపములును అజ్ఞానకృతదోషములును శక్తిహీనతచేతఁ జేసినపాపములును విధ్యుక్తముల ననుసరింపలేమిచే గలిగినప్రత్యవాయములును గాయక వాచిక మానసికములైన అన్నిఅపరాధములును వీనినన్నిటినుండియు ఓపతితపావన

మూర్తీ! నన్ను విముక్తుని జేసి రక్షింపుము. రక్షింపుము. నమస్తే నమస్తే నమః ఓం.

వివరణ:—ఈప్రకారము సమాహితచిత్తముతో నీపాపములను ఒప్పికొనుచు ఆర్తితో ఈయపరాధక్షమాస్తోత్రమును జేసి అనంతరము నీపాపములనుగుఱించి మఱిమఱి నిజమైన పశ్చాత్తాపజన్యమైన అసహ్యమును లజ్జను వ్యసనమును బొందుచు ఇట్టిదోషములను ముందుచేయనని దృఢనిశ్చయమును జేసికొని నీపూనికను నెఱవేర్చుకొనుటకు సహాయభూతుఁడవు కమ్మని మనఃపూర్తిగ ఆపద్బాంధవుని బలుమాఱు వేఁడుకొనుచుండుము.



## అనుతాపసూచకమైన ఆర్తి.



ఓభక్తార్తిహారణా! నాపాతకములు నాతలనుమీఱియున్నవి. నాపాపరాశి అంతరిక్షమువఱకును బెరిగియున్నది. నేను లజ్జాక్రాంతహృదయుఁడనై నీదివ్యసమ్ముఖమున దలయెత్తుటకు సిగ్గుపడుచున్నాను.

ఓచిత్తమా! నన్ను భ్రమింపఁజేసి మోసపుచ్చి పొందిన ఇంద్రియ జన్యమిథ్యాసుఖమువలన ఏమిఫలముకలిగినది? ఇది సుఖాభాసదుఃఖముగాని నిజమైనఆనందమా?

ఓదీనరక్షకా! నేనెంతఅవివేకిని! ఎంతవెఱ్ఱివాఁడను!

కరుణానిధివయిన నీవు అంతరాత్మరూపమున వలదువలదని నివారించుచుండ నిరాకరించి నాకు మృత్యుకరమైన పాపరూపవిషమును నాచేతులతోనే నేను ఆత్రముతోఁద్రాగితిని!

ఆహా! నాఅంతశ్శత్రువులతో నేనేకీభవించి ఆత్మద్రోహినై నామనస్సును పాపకృత్యములకుఁ బురికొల్పి నానరకమును నేనేకల్పించుకొంటిని! ఇట్టిదురాత్ముఁడనైన నేను నీసన్నిధిని జేరుటకు నాముఖమెట్లు చెల్లును?

అయినను సంతాపాగ్నిదగ్ధుఁడనైన నన్ను ఓపతితపావనమూర్తీ! పరిశుద్ధాంతఃకరణతో నుజ్జీవింపఁజేయుము.

పాపముకంటె గర్హ్యమైనదియు అతిదుష్టమైనదియుహృదిస్థుఁడైన ఈశ్వరుని మఱుఁగుపఱుచునదియు మరియొకటిలేదు. దానిని నేనిపుడు అతిహేయమైనదానిగ జూచుచున్నాను. నీపతితపావనత్వమును నిర్హేతుకకటాక్షమును నన్నురక్షింపవలెను గాని నాయెడల నీకుఁగనికరము పుట్టించుటకు దగిన యోగ్యత నాయందు లేశమైనను లేదు.

ఇంతకాలము నన్ను జీవింపఁజేసి నాపాపములనుగుఱించి ఈవిధముగఁ బశ్చాత్తాపపడుటకు ఈయవకాశమును గలుగఁజేసిన నీదయామయత్వమును గొనియాడుటకు నేనెంతవాఁడను.

నాపాపములనుక్షమించి నన్నుపునీతుని జేయుటవలన నీపతితపావనత్వము ముల్లోకముల్ల విశ్రుతమగుఁగాక.

నమస్తే నమస్తే నమః ఓం.

---

## దృఢసంకల్పము.

మహాప్రభూ! నేనిదివఱకుఁ గామక్రోధాదులచే మోహితుఁడనై పాపమునకు వెఱవక నీయాజ్ఞలను ధిక్కరించి కండకావరముచే మీఁదెఱుంగక విచ్చలవిడిగా సంచరించితిని.

ఇప్పుడు నీకరుణాకటాక్షమువలనఁ దెలివి తెచ్చుకొని నాదురుద్యోగములకుఁ బశ్చాత్తాపమునొంది నీమహిమచేఁ బావనుఁడనై నేఁడుమొదలు అనన్యశరణ్యుఁడనై నిన్నే నమ్మి నీకేదాసుఁడనై నిన్నే సేవించుచు నీయాజ్ఞానుసారముగఁ జరించుటకు దృఢనిశ్చయుఁడనైనాఁడను,

దేవా! కామక్రోధాదులప్రేరణలకు నేనిఁకనెన్నఁడును లోఁబడక వానికార్యములైన పాపకృత్యములను విసర్జించుటకు గృతనిశ్చయుఁడనైనాఁడను,

స్వామీ! నీదాస్యమునకు అంతరాయమునుగలుగఁజేయు నిరర్థకములైన ప్రాపంచికభేషజములను బాపస్వభావముగల ఇంద్రియసుఖములను విడిచిపెట్టుటకు నిశ్చితాభిప్రాయుఁడనైనాఁడను.

తండ్రీ! నీదివ్యశాసనములను శిరసావహించి నాయావజ్జీవమును నీదివ్యచిత్తానుసారముగ సంచరించుటకు దృఢముగ సంకల్పించినాఁడను.

వరదుఁడా! నాపూనికలను నాయావజ్జీవమును దప్పక

నెఱవేర్చునట్టి మనోదార్ఢ్యమును నాకు బ్రసాదింపుమని వింక్కిలి దీనముగ వేఁడుకొనుచున్నాను.

రక్షకా! ఇట్టిసద్బుద్ధిని నాకుఁబ్రసాదించిన నీనిర్హేతుక కటాక్షమునకై నీకుమనఃపూర్తిగ వెయిశేలవందనములను జేయుచున్నాను. నమస్తే నమస్తే నమః, ఓం.

---

## అర్పణ.

బంధమోక్షములను రెండింటిని నామనస్సునకు గోచరింపఁజేసి మోక్షమార్గమును అవలంబించునటులు ప్రేరణచేయుచున్న ఓమోక్షప్రదాతా! నీనామము జగజ్జేగీయమానమైయుండుఁగాక!

ఓఅపవర్గప్రదా! నేను సంపూర్ణాంతఃకరణముతో మోక్షమునేకోరుచున్నాను. అనఁగా నీవు మోక్షస్వరూపుఁడవుగాన నిన్నే పొందఁగోరుచున్నాను.

ఓయజ్ఞేశా! నాఆత్మయజ్ఞమును గరుణతో నంగీకరింపుము.

ఓపరిపూర్ణుఁడా! నాఇంద్రియజాలమును నాఅంతఃకరణధర్మములను నాశక్తియుక్తులను నాఆశాపాశములను నీకు అర్పించుచున్నాను నాఅభీష్టములను నాయెత్తుగడలను నాప్రయత్నములను నావిద్యావ్యాసంగమును నాశేషకాలమునంతను నాసర్వస్వమును «నేను» «నాది» అనఁబడుదానినంతను నిశ్శేషముగ నీదాస్యముక్రింద వినియోగపఱచెదను.

ఓపరమాత్మా! నాస్థూలసూక్ష్మశరీరములను నీకువాస యోగ్యములుగఁ బవిత్రముచేసి ఆ పరిశుద్ధాలయమునందు నీవు వసించి నాకునియంతవుగానుండుము. నేను నీకుదాసుఁడనై నీదివ్యచిత్తానుసారముగ సేవించెదను. నమస్తే నమస్తే నమః ఓం.

---

## సమదృష్టి.

ఓపరమేశ్వరా! ఇదిమొదలు ప్రతిమానవుని మాటమాత్రచేఁగాక క్రియచేతఁగూడఁ బ్రేమించెదను.

నాకు ఎవరుఎట్టిఅపకృతినిజేసినను దానిని నామనఃపూర్తిగక్షమించెదను. నీవును దయాళుఁడవై వారలనుక్షమింపుము.

సర్వసముఁడా! నన్ను ద్వేషించువారినిసహితము అనుగ్రహింపుము. నాయందు ఈర్ష్యకలవారికైనను మేలేచేయుము నాయెడల వారుచేసినఅపకృతికి వారికి ఉపకృతినేచేయుము.

ఓపరమకారుణికోత్తమా! నేను ఏవిధముగనైన అపకారముచేసినవారికి శుభమును గలుగఁజేయుము.

నాప్రేరణవలన ఇతరులుచేసినపాపములకు వారలను నన్నునుగూడ క్షమించుటయేగాక వారును నన్నుక్షమించునటులు ప్రసాదింపుము.*

ఓమంగళాకారా! నీకరుణారసవృష్టిచే సర్వజనులకును సర్వభూతములకును శుభమగుఁగాక! ఎల్లలోకములవారలకును సుఖముకలుగుఁగాక! యుక్తకాలములయందు సువృష్టికలిగి భూమి సస్యసమృద్ధమగుఁగాక! తాపత్రియమును ఈతిబాధలును శాంతించునుగాక! నమస్తే నమస్తే నమః ఓం

---

## ఈశ్వరకరుణనుగుఱించినప్రార్థన.

ఓపరమేశ్వరా! నీదివ్యశాసనములను శిరసావహించెదనని నేను బ్రతిజ్ఞచేసితిని. ఆప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుటకు నేను ఉద్యుక్తుఁడనైయున్నాను. కాని అయ్యో కేవలనాస్వశక్తిచేత మంచిని లేశమైనను జేయఁజాలను. మంచితలంపులనైనను దలంపలేను.

నేను నీపాదారవిందధ్యానమునుండి లేచినతోడనే ఇప్పుడునేనెంతో దృఢచిత్తముతోఁ ద్యజించినపాపములను మరలజేయునటులు నాదుర్బుద్ధి నన్ను బ్రేరణచేయును. యుక్తకాలములో నీకరుణ అడ్డుపడనియెడల ఆదుర్బుద్ధి నన్నుదప్పకమోసపుచ్చును. అయినను నీకటాక్షలేశముకలిగినచో నేను అన్నిటినిజయింపఁగలను. ఓకరుణాసముద్రుఁడా! నిన్నేనమ్మియుంటినిగాన నాఅశక్తిని సుశక్తిగచేయుము.

సద్భక్తితోఁ బ్రార్థించువారికి అంతశ్శత్రువులనుజయించు

నీఐశ్వరశక్తిని బ్రసాదించెదనని నీవుకరుణతోఁ జేసిన ప్రతినను నెఱపి బహువినయముతో మనఃపూర్తిగఁ బ్రార్థించుచున్న నాకు నాదుస్స్వభావమును బరిశుద్ధపఱుచుటకును సామనస్సును దృఢపఱుచుటకును ఆపదలుసంభవించినపుడు ధైర్యపఱుచుటకును ఉత్సాహభంగముకలిగినపుడు పురికొల్పుటకును మనోవికారహేతువులను బ్రతిఘటించుటకును విధాయకకృత్యములను యథావిధిగనడపుటకును నీఐశ్వరశక్తిని బ్రసాదింపుము.

సర్వాంతర్యామివై హృదయధర్మములను శోధించు సర్వజ్ఞుఁడా! నేను ఎంతప్రియత్నించినను విడనాడలేనినాదుర్గుణములను నీవుగుర్తెఱిఁగియున్నావు [నీకుదెలిసినమట్టుకు అట్టిదుర్గుణములను ఇక్కడఁ బేర్కొనుము] వీనివిషయమై ముఖ్యముగ నాపూనికనుదప్పిపోయెదనని మిక్కిలి భయపడుచున్నాను ఓ దేవా! వీనివిషయమై నీసహాయమును రెట్టిగఁబ్రసాదింపుము. నేనుభ్రమపడి దారితప్పకుండ నన్ను సన్మార్గముననిలుపుము.

అంతఃకరణవిచారణలోఁ బేర్కొనఁబడిన పాపములలోఁ జాలపాపములను నేనుజేయనిమాటసత్యమేగాని అందుకు నీకటాక్షమేకారణముగాన ఆఘనత నీదేకానినాదికాదు. అయ్యో! పాపమందే అభిరుచికలిగియుండుట నానైజగుణముగాననీకరుణ అడ్డుపడనియెడల నాకు వయస్సును స్వతంత్రతయును అవకాశములును హెచ్చుఅయినకొలఁదిని మనోవికారవిషయములు నన్ను మరలుకొల్పి నేను ఇప్పుడుచేసికొన్న మనోనిశ్చయములను అన్నిటిని నాశముచేయును,

సర్వశక్తిగల భగవంతుఁడా! నిన్ను శరణుచొచ్చిన నేను బాపమనెడివలలోఁ జిక్కుకొనకుండ జాగరూకుఁడనై విరామములేకుండ నిన్నుఁబ్రార్థించునటులు ప్రసాదింపుము. నమస్తే నమ స్తే నమః ఓం.

---

## ఈశ్వరకృపావిశేషములనుగుఱించినప్రార్థన.

ఓసర్వేశ్వరా! నీదివ్యశాసనములనన్నిటిని మన్నించునట్టి దృఢచిత్తము నాకుఁగలిగినయెడల నేను గృతార్థుఁడనగుదునుగదా!

నామనస్సును నీదివ్యచిత్తానుసారముగ నడపించునట్టి సామర్థ్యమును నాకుఁబ్రసాదింపుము.

నీమాయయనెడితెరనుదొలఁచి తత్వమునెఱిఁగెడి జ్ఞానమును; నావిధాయకకృత్యములను దెలిసికొనెడివివేకమును; వానినిదప్పక చేయునియమమును; నిజమైనపశ్చాత్తాపమువలన బాపక్షయమగుననియు నిన్నునిశ్చలభక్తితో భజించుటవలన గలిగిన చిత్తశుద్ధివలనఁ బాపనివృత్తియగుననియు దృఢవిశ్వాసమును నీనిశ్చలధ్యానమువలన మోక్షానందముకలుగునెడి నమ్మకమును; నీయందు బద్ధానురాగమును; నీకోపప్రసాదములనుగుఱించి ఎడతెగని భయకాంక్షలును; నాకుఁగలుగఁజేయునటులు నీదివ్యచిత్తసంకల్పమగుఁగాక.

పాపమునకువెఱచు మనస్సును; ఈశ్వరవిలాసమునకు లోనగుచిత్తమును; ఇంద్రియశోషణమును; నీనిరంతర దివ్యసాన్నిధ్యానుభవమును; నీయందునిశ్చలభక్తిని; నీమహిమప్రకాశముకొఱకు నిజమైన ఉద్దేశోద్యోగములును; సత్కార్యసానుకూలతయందుఁ బట్టుదలయును; ఆపదలు మనోవికారవిషయములు పొడచూపినపుడు నిశ్చలత్వమును; ఓదేవా! నాకుఁ గలుగఁజేయుము!

నీనామోచ్చారణయందు భయభక్తులును; నీసేవయందు ఉత్సాహమును; పుణ్యతీర్థపుణ్యదినములయందు గౌరవమును; సద్గ్రంథపరిశీలనమందు మిక్కిలిశ్రద్ధయును; కాలవ్యయమునందు జాగరూకతయును; ఓసర్వేశ్వరా! నాకుఁబ్రసాదింపుము.

యుక్తాహారవిహారములును యుక్తస్వప్నావబోధములును; వినయవిధేయతలును మందలింపఁబడినపుడు సహనమును గలవానిగ నన్నుసవరింపుము.

ఉల్లాసము నిరహంకారము నిదానము తృప్తి నెమ్మది సాధుత్వము శాంతమునుగల స్వభావమును నాకు అనుగ్రహింపుము.

ఓదేవా! ఆరోగ్యమును సుఖజీవనమునకుమాత్రము చాలునంతఉపాధిని సదసద్వివేకమును సూక్ష్మగ్రాహిత్వమును దృఢమైనధారణశక్తిని నీదివ్యచిత్తానుసారముగ ఐహికసుఖము

లను నాకుఁగలుగఁజేయుము. నీవు నాకనుగ్రహించిన ఆరోగ్యాదులను సత్కార్యములయందు వినియోగింపఁజేయు సద్బుద్ధిని నాకొసంగుము.

పావనమూర్తీ! నాఅంతఃకరణధర్మములను జిత్తవృత్తులను దలంపులను బరిశుద్ధిచేయుము. దుర్వాక్యములను వచింపకుండ నావాగింద్రియమును బంధింపుము. దుర్వార్తలను నా చెవులఁబడకుండఁజేయుము. పాపమునుండియు వేషమునుండియు నాదృష్టిని మరల్పుము. దుర్వృత్తులయందుఁ బ్రవర్తింపకుండ నాఇంద్రియములనన్నిటిని గాపాడుము.

ధర్మస్వరూపుఁడా! నావ్యవహారకృత్యములలో న్యాయముతప్పకుండునట్లును; ఒరులు నాయెడల నెట్లుజరిగింపవలెనని నేనుగోరుదునో అట్లే నేనును వారియెడలజరిగించునట్లును నాతలిదండ్రులకును గురువులకును ఏలికకును న్యాయాధిపతులకును ఇతరఅధికారులకును నేను విధేయుఁడనై యుండునట్లును; వారివారిపదవులననుసరించి వారిని నేను గౌరవించునట్లును; బ్రసాదింపుము.

ఓప్రసన్నాత్మ! నాకు ఇతరులుచేసినచెఱుపులకు నేను వారలను క్షమించునట్లును; ఇతరులకు నేను ఎట్టిబాధనైనను గలుగఁజేయకుండునట్లును; నాకు ఉపకారులైనవారియెడల కృతజ్ఞత కలిగియుండునట్లును; నాతోసరిసమానులయెడల స్నేహభావము కలిగియుండునట్లును; నాకంటెఁ దక్కువవారియెడల నిరతిశయముగనుండునట్లును; ఆపదలోనున్నవారియెడలఁ గ

నికరముకలిగియుండునట్లును; బీదలకు నాశక్త్యానుసారముగ దానముచేయునట్లును; సత్పురుషులయందు భక్తియును శత్రువులయెడల క్షమయును గలిగియుండునట్లును గరుణింపుము. నీయెడలను భూతకోటియెడలను నిరపరాధినిగాఁ జేయు అంతఃకరణశుద్ధిని నాకుఁ బ్రసాదింపుము.

మొండితనముచేతఁగాని బుద్ధిపూర్వకముగాఁగాని అహంకారముచేతఁగాని తెలిసిగాని తెలియకగాని ఎట్టిపాపములనైనఁ జేయకుండునట్లును, ఎట్టిదుర్మార్గతకును వశవర్తినిగాకుండునట్లును; ఓసన్మార్గదర్శీ! నీదాసునిగాపాడుము.

మొండిపట్టు, గర్వము, వృథాకాలక్షేపము, బద్ధకము, అతివ్యాప్తి, యౌవనోద్రేకము, చపలత, అనృతము, ఇట్టిదోషములనుండియు; నాస్తికసిద్ధాంతములు, అసద్గురువులు, వశవర్తులుగాని కామక్రోధాదులు, దురభ్యాసములు, పాపమందు అభిరుచి, దైవదూషణ, దుస్సహవాసము, ఓర్వలేమి, కార్పణ్యము, ఇతరులను లాఘవపర్చుటయందు అభిలాష, నిర్దాక్షిణ్యము, వీనినుండియు, ఓసద్గురూ! నన్ను విముక్తునిఁ జేయుము.

ఈకాలానుసారములైన దుర్గుణదురాచారములనుండియు ఏమూలనైన అణఁగియుండు పాపచింతలనుండియు నాదుస్స్వభావమునకు మిక్కిలి అభిరుచియైనపాపములనుండియు నీకు ఎయ్యవి అసహ్యములో నాకు ఎయ్యవి నిరయహేతువులో అట్టి సమస్తకిల్బిషములనుండియు, ఓపాపహరా! నన్ను విము

క్తునిజేయుము.

ఇంతయేల? ఓభక్తచింతితార్థప్రదాయకా! నానడత నీపరమభక్తాగ్రేసరులనడత ననుసరించియుండునటు లనుగ్రహింపుము. నమస్తే నమస్తే నమః. శాన్తి శ్శాన్తి శ్శాన్తిః. ఓం తత్ సత్.






# సద్గుణాభ్యాసము.

1. దుష్టులుకానిప్రజలందఱును సామాన్యముగ సత్ప్రవర్తనకలవారై యుండుటకే అపేక్షించెదరుగాని నీతిమంతులమైయుండెదమని మనస్సుచే నిశ్చయించినమాత్రమున భ్రమ ప్రమాదములకులోనుగాక ఏకరీతిగ సత్ప్రవర్తనకలిగియుండుట సాధ్యముకాదు. అవిచ్ఛిన్నమైన సుశీలతకలిగియుండవలెననిన అందుకుప్రతికూలమైన అలవాటులను బ్రయత్నముచే వదల్చుకొని నిత్యాభ్యాసముచేత సదాచారములను దృఢపఱచుకొనవలయును.

2. ఇందునుగుఱించి లోకోపకారపరాయణుఁడును గొప్పఅనుభవశాలియునగు బెంజమిన్ ఫ్రాంక్లిన్ దొరగారు చెప్పినసామాన్యవిధులును అభ్యాసముచేయురీతియును అనుభవసిద్ధముగనున్నందున అవి కొన్నివివరణలతో ఈక్రిందవ్రాయబడినవి.

3. శ్లాఘ్యమైన సత్ప్రవర్తనకలవాఁడగుటకు అభ్యాసముచేయవలసిన ముఖ్యమైన సద్గుణములు ఏవియన—

(1) <u>మితానుభోగము</u>— అతిసర్వత్రవర్జయేత్, మితభుక్ హితభుక్, అనునీతులననుగమనించి దేనియందును మితిమీఱి

ప్రవర్తింపకుము.

(2) తూష్ణీంభావము—నీకైనను ఒరులకైనను మేలు కలుగఁజేయుతగని మాటలాడకుము. తులువప్రసంగమును దప్పించుకొనుము.

(3) నియమము—ఆయాపనులకుఁ దగినకాలములను స్థలములను ఏర్పాటుచేసికొని ఆయాపనులను నియతమైనకాలములయందును స్థలములయందును జేయుము. నీవస్తుసంభారములను నియతస్థానములయందే యుంచుము.

(4) దృఢసంకల్పము-విధాయకకృత్యములను దప్పకచేసెదనని పూనికచేసికొనుము. నీపూనికలనుదప్పక నెఱవేర్చుకొనుము

(5) మితవ్యయము—నీకైనను ఒరులకైనను మేలుకలుగని విషయములయందు ధనవ్యయముచేయకుము.

(6) పాటుపడుట—వృథాకాలక్షేపముచేయకుము. ఎల్లప్పుడును ఏదియో ఒకఉపయోగకరమైనపనిని జేయుచుండుము. అనావశ్యకమైన కార్యములను విడిచిపెట్టుము.

(7) ధారాళత్వము—అన్నివిషయములయందును అమాయకముగను త్రికరణశుద్ధిగను మెలంగుము. అనృతమని నీకుఁ దెలిసినట్టియు నీవు నమ్మనట్టియు సంగతినిగాని నిజమని నీకుదెలియనట్టియు నీవునమ్మనట్టియు సంగతినిగాని నిజమని వక్కాణింపకుము. వాక్కులచేతఁగాని చేష్టలచేతఁగాని తప్పుఅభిప్రాయమును గలుగఁజేయుటకు యత్నింపకుము.

(8) న్యాయము—చెఱుపుకలుగఁ జేయుటవలనఁగాని నీవు విధాయకముగఁ జేయవలసినసహాయమును జేయకపోవుటవలనఁగాని ఎవరికిని అన్యాయముచేయకుము. ఒరులు నీయెడల నెటులుప్రవర్తింపఁగోరెదవో అటులే నీవును వారియెడల బ్రవర్తింపుము.

(9) పరిశుద్ధత—దేహ గేహ వసనములయందు లేశమైనను మాలిన్యము చేరనీయకుము.

(10) అక్షోభము—స్వల్పసంగతులకును సామాన్యముగ సంభవించెడి లేక నివిర్తింపఁగూడనిదియునైన దైవికములకును క్షోభపడకుము.

(11) అస్ఖాలిత్యము—పరపురుషులను సోదరులవలెను బరస్త్రీలను సోదరీమణులవలెను భావింపుము.

(12) నమ్రత—అందఱియెడలను నిగర్వముగను వినయముతోడను సంచరింపుము.





# అభ్యాసమార్గము.



ఈసామాన్యసూత్రములను బ్రాతఃకాలమున స్మరింపుము. రాత్రి శయనించుటకుముందు వీనిని ఏవిషయములయందు దప్పిపోతివో ఆలోచించి కనిపెట్టుము. ఈక్రిందవ్రాసిన మాదిరిగలపట్టీలోఁదప్పిపోయినట్టు కనుఁగొనఁబడినసద్గుణములకుఎదురుగనుండు ఆయావారముల యొక్కగడియలో నల్లచుక్కనుబెట్టుము. ఈరీతిని బ్రతిదినమును దప్పక చేయుము. వారమునకొకసారి ఈనల్లచుక్కలను అడ్డముగ లెక్కించి మొత్తము చేసినచో ఏసద్గుణము ఎంతవఱకు పట్టుపడలేదో తెలియవచ్చును. తప్పిపోయిన సద్గుణములనుగుఱించి పరితపించి ముందు వారములో వానివిషయమై హెచ్చుజాగ్రత్తనుబుచ్చుకొనియెదనని నిశ్చయించుకొని ఈశ్వరసహాయమును వేడికొనుము. ఈప్రకారముచేయుటలో ఒక్కొకవారమంతయు ఒక్కొకసద్గుణమునందు హెచ్చుగుఱినుంచి ఆసద్గుణమును దప్పిపోకయుండునటులు జాగరూకుఁడవైయుండుము. ఈప్రకారము ఒక్కొకవారమంతయు ఒక్కొకగుణమునందు గుఱియుంచినచో 12 వారములలో 12 సద్గుణములనుగుఱించియు గుఱి యుంచవచ్చును. ఇటుల సంవత్సరమునకు నాలుగువారములకుఁ దక్కువకాకుండ ఒక్కొకసద్గుణము విశేషముగను మూడువందల అఱువది

అయిదుసార్లు అన్ని సద్గుణములను సామాన్యముగను అభ్యాసముచేయవచ్చును. అభ్యాసియొక్క స్వభావము పరాకాష్ఠ మొదలగుసంగతులనుబట్టి ఒకటి, రెండు, మూడుసంవత్సరములలో ఇందువలన దుర్గుణనాశమును సద్గుణసంగ్రహమును దృఢముగఁ గలుగవచ్చును.

ఈసద్గుణాభ్యాసమువలన ఇహమందు సకలశ్రేయస్సులును గలుగుటయేగాక నిజమైన ఈశ్వరారాధనకు సత్ప్రవర్తన ప్రధానముగాన దీనితోఁ జేయఁబడు ఈశ్వరారాధనవలనఁ బరమపదప్రాప్తియునగును.

ఈరీతిని బ్రతిదినమును అభ్యాసముచేయుటకు దినమునకు గొంచెము హెచ్చుతగ్గుగ బదునేనునిమిషములుచాలును గాన జనులందఱును సులభముగ ఈఅభ్యాసముచేయవచ్చును.



| సద్గుణము. | వారములు. | | | | | | | వెరశి |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని | |
| 1 మితానుభోగము | • | • | | | | | | 2 |
| 2 తూష్ణీంభావము | | • | | • | • | | • | 4 |
| 3 నియమము | | | | • | | • | | 2 |
| 4 దృఢసంకల్పము | • | | • | | • | • | | 4 |
| 5 మితవ్యయము | | • | • | | • | • | | 4 |
| 6 పాటుపడుట | • | | • | | • | • | | 4 |
| 7 ధారాళత | • | • | • | | • | • | • | 6 |
| 8 న్యాయము | • | | • | • | • | | • | 5 |
| 9 పరిశుద్ధత | | | | • | | | • | 2 |
| 10 అక్షోభము | • | | • | | • | | | 3 |
| 11 అస్థారిత్యము | | | | | | | • | 1 |
| 12 నమ్రత | | | • | | • | | • | 3 |